# GALAVA RISHI

OR

# CHITRASENOPAKHYANAMU

**A DRAMA IN TELUGU.**

---

# గాలవఋషినాటకము.

లేక

# చిత్రసేనోపాఖ్యానము.

---

గ్రంథకర్త

డి. వేంకటరమణయ్య, బి. ఏ.

D. Venkataramanayya

శ్రీ

# గాలవఋషి నాటకము

లేక

# చిత్రసేనోపాఖ్యానము

ఇయ్యది

భద్రాచలరామదాసు నాటకమును

రచియించిన

డీ. వేంకటరమణయ్య, బి. ఏ. గారిచే

విరచితము

చెన్నపురి:

ఆంధ్రపత్రికాలయమునందు

ముద్రితము

1925



[వెల 12 అణాలు.

# ప్రకటన

---

ఈ గాలవఋషినాటకమునకుఁ గల సర్వస్వాతంత్ర్యములు, గ్రంథకర్తకుఁ జెందియున్నవి. కావున, దీనిని భాషాంతరీకరణ మొనర్పవలయు నన్నను, లేక, ఖేలన మొనర్పవలయు నన్నను, లిఖితరూపముగా వారి యనుమతిని ముందుగనే పొందవలెను.

# విజ్ఞప్తి

ఈ రూపకము అఱవభాషయందు, అనేకనాటకములు రచియించి ప్రఖ్యాతి గాంచిన రావుసాహేబు పమ్మల-సంబంధమొదలి యారు, బి. ఏ., బి. ఎల్., గారిచే రచియింపఁబడిన నాటకము నను సరించి వ్రాయఁబడినది. ఈనాటకము రసవంతముగను, ప్రదర్శనమునకు అనుకూలముగను నుండుటచే నేను దీనిని ఆంధ్రీకరింపఁ దొడఁగితిని. అయ్యది అఱవభాషలోఁ బెక్కుసారులు ప్రదర్శింపఁబడి నటులకును ప్రేక్షకులకును ఆనందము కలుగఁజేసి మెప్పువడసినది. ఆతీరుననే తెనుఁగు భాషయందుఁగూడ నిధి సన్మానింపఁబడు నని నమ్మెదను. ఈనాటకము ను "నారదనైపుణి" యనుపేర, శంకర సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సంస్కృతభాషలో సైతము రచియించి యున్నారు.

ఈగ్రంథరచనయందు నాకు తోడ్పడిననామిత్రులగు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికిని, బ్రహ్మశ్రీ వెదురుమూడి శేషగిరి రావుగారికిని, శ్రీమాన్ పండిత ఈ. భాష్యకాచార్యులుగారికిని శ్రీమాన్ బుక్కపట్టణము-రామానుజయ్యగారికిని కృతజ్ఞతాపూర్వక వందనము లొనరించువాఁడ.

ఈ నాటకమునకు నా మిత్రుఁడును, చెన్ననగర శాసనసభా సభ్యుఁడును నగు, శ్రీమాన్, ఎస్. సత్యమూర్తి, బి. ఏ., బి. ఎల్., గారు, దయతో నొకతొలిపలుకు నొసంగి యున్నారు. ఇందులకు వారి కనేకకృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాఁడను. అయ్యది

ఆంగ్లేయభాషలో వ్రాయఁబడినది గనుక, దానిని ఆంధ్రీకరించి యిందుతో నచ్చొత్తించియున్నాను.

ఇంతకుఁ బూర్వము భద్రాచల "రామదాసు" అను భక్తిరస పూరిత మగునొకనాటకమును రచియించి ప్రచురించియున్నాను. ఈ నాటకము నా రెండవసమర్పణము. "రామదాసు" నాటకము నాదరించినరీతినే, ఆంధ్రమహాజనులు దీనిని గూడ ఆదరింపఁ బ్రార్థితులు. విద్వజ్జను లిందలిపొరపాటులను మన్నింతురు గాక !

28, కారణేశ్వరగుడివీధి,
సైదాపేట, మదరాసు.
28-4-1925.

డి. వేంకటరమణయ్య,
గ్రంథకర్త.

# INTRODUCTION

—:o:—

I have been requested by my esteemed friend Mr. D. Venkataramanayya, B.A., to write an introduction to his new drama in Telugu, entitled *Galavarishi*. I very gladly do so, though, my credentials for that task are very few. Especially, the want on my part of a knowledge of the language in which the drama is written, is a serious handicap to me. But I have had the drama read to me, and I have been able to appreciate its true worth.

The Drama is yet to come by her own in South India. Those who are familiar with the place the drama occupies in the social and literary life of other and more advanced nations, cannot but regret that the place of the Drama in South Indian life is still very far from what it ought to be. The defect is not in the quantity, for we have an ever increasing number of Theatres, Sabhas and Dramas. But the quality of most of them leaves very much to be desired.

In one direction and that the most important, Mr. D. Venkataramanayya is doing splendid work to remove this defect. His well-known drama "*Ramadas*" has already secured a warm place in the hearts of theatre-goers and literateurs. The present work promises to take the same place.

The art of play-writing, even where the plot is borrowed, is a very difficult one. Shakespeare wrote his masterpieces mostly with borrowed plots. The real secret of a good play consists in the effective portraying of dramatic situations, and in the artistic development of the principal

characters in the drama. Mr. D. Venkataramanayya has succeeded remarkably well in these two respects in this drama. The dramatic situations are depicted with a true instinct and where he has changed the plot in one place, the reader will easily recognise it is for the better. The characters too are not mere automatons, but are warm human personalities.

The problem of the place of music in a drama of this kind, mainly intended to be staged, is a very ticklish one. But Mr. D. Venkataramanayya has successfully tackled that problem. Music plays its rightful part in this drama, that is, of helping the development of the plot. Of the style of the drama, I speak with great hesitancy, but I can assure the reader that he will find the language of the drama, chaste, easy, and simple.

On the whole, I heartily congratulate my friend on the production of this Drama. I look upon him as a valued colleague, for without the establishment of literary and dramatic Swaraj in our country, political Swaraj will be but a barren tree. I have no doubt that this drama will soon find a high place with the lovers of literature and the theatre.

Purasawalkam
21st April 1925

**S. Satyamurti.**

# ఉపోద్ఘాతము

నా మిత్రులగు, డి. వేంకటరమణయ్య, బి. ఏ., గారు, క్రొత్తగాఁ దెనుఁగుభాషయందు వ్రాసిన "గాలవఋషి" యను నాటకమునకు ఉపోద్ఘాతము వ్రాయుటకు నన్నుఁ గోరిరి. అందులకు నేను చాలనివాఁడ నైనను సంతోషముతో నియ్యకొంటిని. నాటకము యొక్క భాష నాకుఁ దెలియమి యొక పెద్దలోపము. అయినను, నాటకమును జదివించి విని యందలి శ్రేష్ఠతను గ్రహింపఁ గలిగితిని.

దక్షిణహిందూదేశమున నాటకకళకు లభింపవలసిన యర్హస్థాన మింకను లభింపలేదు. మిగుల నభివృద్ధి గాంచిన యితర జాతుల సాంఘిక సారస్వత జీవితములందు, నాటకకళకుఁ గల యౌన్నత్యమును బాగుగా నెఱింగినవారు, దక్షిణహిందూదేశమునం దదియభివృద్ధిఁ జెందమికిఁ జింతిల్లకమానరు. ఈ లోపమునకుఁ గారణము సంఘములసంఖ్య యల్పమగుట కాదు. నాటకశాలలయు, నాటకసంఘములయు, నాటకకవులయు సంఖ్య నానాఁటికి హెచ్చుచునే యున్నది. కాని, వానిప్రాశస్త్యముమాత్రము తృప్తికరముగా లేదు. పైమూఁడింటిలో ముఖ్యమగు నొకవిషయమున, ననఁగా, నాటకగ్రంథరచనయందుఁ గలలోపములను దొలఁగించుటకు, డి. వేంకటరమణయ్యగారు కడుశ్లాఘనీయముగా కృషి సల్పుచున్నారు. వీ రింతకు మున్ను వ్రాసిన "రామదాసు" నాటకము, నాటకప్రేక్షకులవలనను, విద్యావంతులవలననుంగూడఁ జాల నాదరింపఁబడినది. ఈ గాలవఋషి నాటకము సైత మటులే యాదరింపఁబడఁగల దని రుజువుపఱచుచున్నది.

ఇతరులు కల్పించినయితివృత్తమును గ్రహించినను గూడ, నాటకరచనము మిగులఁ గష్టతరమైనకార్యము. షేక్స్పియర్

మహాకవి రచించినయుత్తమనాటకములందలి యితివృత్తములు విశేషముగా నితరులచేఁ గల్పింపఁబడినవియే. ఆకర్షణీయము లగునద్భుతరంగములను గల్పించుటయును, ప్రధానపాత్రలను రసవంతముగాఁ బోషించుటయునే, యుత్తమనాటకరచనయందుఁ గల పరమరహస్యము. ఈనాటకమును వ్రాయుటలో, నీరెండువిషయములయందును గూడ, వేంకటరమణయ్యగారు శ్లాఘాపాత్రులైరి. పాత్రలస్వభావములను జక్కఁగ గుర్తించి ప్రజ్ఞతోడుత నద్భుతరంగములను గల్పించిరి. ఒకచోఁ, నీ రీతివృత్తమును మార్చినస్థలమునందు నాటకప్రాశస్త్యము హెచ్చినదని చదువరులు గ్రహింపఁజాలకపోరు. నాటకపాత్రలు కీలుబొమ్మలుగఁ గాక, సజీవమానవవ్యక్తులుగానే చిత్రింపఁబడెను.

ప్రదర్శింపఁబడుటకు నుద్దేశింపఁబడినయిట్టినాటకములందు సంగీతస్థాననిర్ణయసమస్య క్లిష్టమైనది. కాని వేంకటరమణయ్యగా రీవిషయమును జక్కఁగా నిర్వహించిరి. ఇతివృత్తమును వృద్ధి నొందించుటకే యీనాటకమున గాన ముచితరీతిని జేర్చఁబడినది. శైలినిగూర్చి నే నభిప్రాయ మొసంగఁగోరుట సాహసమే యగును. కాని, యిది మృదుమధుర మగుగ్రాంథికభాషలో వ్రాయఁబడిన దని చదువరులకు దృఢముగాఁ జెప్పఁగలను.

మొత్తముమీఁద నిట్టియుత్తమనాటకమును రచించినందులకు నామిత్రుని నేను మనఃపూర్వకముగా ప్రశంసించుచున్నాను. మనదేశమున దృశ్యప్రబంధవాఙ్మయస్వరాజ్యస్థాపనము లేనిచోఁ, కేవలరాజకీయస్వరాజ్యము నిష్ఫలవృక్షమే యగును. కాన, వేంకటరమణయ్యగా రెన్నఁదగిన సహకారి యనియే నేను భావించుచున్నాను. నాటకవాఙ్మయమును నాటకరంగస్థలమును నాదరించువారిబహూకృతికి నీనాటకము త్వరలోనే పాత్రము కాఁగల దనుటకు నా కెట్టిసంశయమును లేదు.

పరశువాకం,
21-4-1925.

ఎస్. సత్యమూ

# కథాసంగ్రహము

## మొదటి అంకము

రంగము:—(1) ఇంద్రసభామంటపము. దేవేంద్రుఁడు, చిత్రసేనుఁ డనుగంధర్వునికి, ఊర్వశి మున్నగునప్సరసలను నాట్యప్రవీణలఁగావించినందులకు మెచ్చి, దివ్యప్రభావము గలయొకయంగుళీయకమును పారితోషికముగా నిచ్చును.

రంగము:—(2) ఇంద్రునిసభాంతికము. చిత్రసేనునిభార్యలలో నొక్కతె యగుసంధ్యావళి, తననాథునివియోగమునకై పరితపించుచుండును. తత్సమయమున నారదుఁ డేతెంచి, చిత్రసేనుఁడు, ఊర్వశి మోహాపువలలోఁ జిక్కి యున్నాఁ డనియు నతని వశపఱచుకొనుటకు దేవేంద్రుఁ డతనికి నొసంగిన అంగుళీయకమును బడసినఁగాని కార్యసిద్ధి గలుగ దనియుఁ దెలుపును. పిమ్మట సంధ్యావళి నాథుని సందర్శించి, విఫలమనోరథ యై, యేతీరున నైన నాయుంగరము నడయ నెంచి వెడలును. తదనంతరము రత్నావళి యను చిత్రసేనునిరెండవభార్యయు నాప్రయత్నమున నే యచ్చటికి వచ్చి, వెడలినవా రూర్వశీచిత్రసేను లని తలఁచి, కార్యము మించెనుగదా యని చింతించుచుండ, నారదుఁ డేతెంచి, చిత్రసేనుఁడు యమునాతీరమున కేఁగె నన, నాతనిఁ గలసికొన నేఁగును.

రంగము:—(3)యమునానదీతీరమునఁ బొదరిల్లు. సంధ్యావళి అంగుళీయకమును పొందుటకై ఊర్వశీవేషము ధరించివచ్చును. రత్నావళియును తన సపత్నికిఁ దెలియకుండ, తానుగూడ ఊర్వశీవేషము ధరించి చిత్రసేనునికడ కేతెంచును. ఈ ముప్వురి సంభాషణములను

చాటున నుండి వినుచుండిన ఊర్వశి చిత్రసేనునిపైఁ గినిసి, దేవలోకము నకు నెగసిపోవును. చిత్రసేనుఁడు ఆమెను వెంటనంటును. సంధ్యావళీ రత్నావళులు విఫలమనోరథలై నిజగృహములకు మరలుదురు.

## రెండవ అంకము

రంగము :—(1) యమునానదీతీరము. చిత్రసేనుఁడు ఆకాశ మార్గమునఁ బోవుచు, తాంబూలోచ్ఛిష్టము నుమియు, నది యమునా నదీతీరమునఁ బ్రభాకరునకు నర్ఘ్యము విడుచు చుండినగాలవఋషి దోసిటిలో పడును. అనుష్ఠానభంగమునకై యతఁడు పరితపించు చుండ నారదముని వచ్చి, చిత్రసేనునిదుష్కార్యమును శ్రీకృష్ణపరమాత్మని యొద్ద విన్నవించిన నతఁడు చిత్రసేనునికిఁ దగినశిక్ష విధించు నని యుప దేశించును. వా రిరువురు శ్రీకృష్ణునియొద్దకుఁ బోవుటకు తీర్మానింతురు.

రంగము:—(2) ద్వారకయందు కృష్ణునినగరు. గాలవఋషి కృష్ణునియొద్ద కేతెంచి, తనకు సంభవించినపరాభవమును తొలఁగింపు మని మొఱనిడును. నారదుఁడుకూడ నచ్చటి కేతెంచును. శ్రీకృష్ణుఁడు గాలవఋషి నోదార్చి, మఱునాఁటిసాయంసమయములోన, చిత్రసే నుని వధించునటులు ప్రతిజ్ఞ చేయును. గాలవఋషియు, నారదుఁడును సంతసముతో వెడలుదురు.

## మూఁడవ అంకము

రంగము:—(1) లతాకుటీరము. సంధ్యావళీ రత్నావళులు తమ నాథునికి ఊర్వశిపై నున్న వ్యామోహమును, యుక్తిమై భేదించి, దేవేంద్రుఁ డతనికి నొసఁగినయుంగరమును పొంద మరలఁ బ్రయత్నిం తురు. తత్సమయమున నారదుఁ డేతెంచి శ్రీకృష్ణుఁడు చిత్రసేనుని విషయమై చేసినప్రతినను తెలుపును. వారు ముగ్గురు దిగ్భ్రమఁ జెంది పరితపించుచు, ఆయాపదనుండి వారిని కాపాడ వేఁడ, నారదుఁడు అర్జు నుని స్వాధీనపఱచుకొనినఁ గాని కార్యసాఫల్యము కలుగ దనియు,

నందాలకై మున్ముందు సుభద్రాసాహాయ్యమును పొందవలయు ననియుఁ జెప్ప, వారు నట్లే వర్తింప నియ్యకొందురు.

రంగము:—(2) ఉద్యానవనము. సుభద్ర, తనప్రాణనాథుఁడు వేఁటకుఁ బోయి, యిడినగడువులో రానందులకుఁ గుందుచుండ, నారదుఁడే తెంచి యర్జునుని యోగక్షేమములు నారయును. నారదుఁడు మాట వరుసగ, గౌరీవ్రత ప్రభావముఁ జెప్ప, సుభద్ర ప్రతిజన్మమునందును నర్జుననినే పతిగాఁ బడయుటకై, ఆవ్రతమును మఱునాఁడే యాచరింపఁ దొడంగును.

రంగము:—(3) ఉపవనప్రాంతము. సుభద్ర గౌరీవ్రత మాచరించి వ్రతసమాప్తికై ప్రాణదాన మొసంగుటకు యాచకులను వెదకును. నారదునానతిచే భార్యలతో నచట వేచియుండినచిత్రసేనుఁడు ఆమెను ప్రాణదానము వేఁడును. సుభద్ర ముందు వెనుకల నారయక తత్క్షణమే ప్రాణదాన మొసఁగును. పిదప చిత్రసేనుని వధించుటకు ప్రతినఁ జేసినది శ్రీకృష్ణపరమాత్ముఁడే యని తెలిసి పరితపించును. తుదను ఆ ఇక్కట్టు నుండి తప్పింపుమని నారదునే వేఁడును. నారదుఁడు, అర్జునుఁడు పూనినఁగాని శ్రీకృష్ణుని ప్రతిన నివారింప నలవి గా దని తెలుప, నందులకు నామె యియ్యకొనును.

## నాలవ అంకము

రంగము:—(1) కృష్ణునివిడిది. సుభద్ర, అన్న యగు శ్రీకృష్ణునియొద్ద కేఁగి చిత్రసేనునకు తాను చేసినప్రాణదానము నెఱింగించి, తనవాగ్దానము కాపాడ వేఁడును. కృష్ణుఁడు, తాను గాలవఋషికిఁ జేసిన వాగ్దానమును తెలిపి, తనప్రతినను గాపాడుకొనుటయు ముఖ్యమని బదులిడును. సుభద్ర తనప్రతినకు ఎట్టులైనను భంగము గావింపఁ గూడ దని అన్నను వేఁడ, నతఁ డామె నోదార్చి పంపును.

రంగము:—(2) సుభద్ర శయనగృహము. సుభద్ర తనపతి యగు నర్జునునితో, తాను చిత్రసేనునకుఁ జేసిన ప్రాణదానవిషయ మును దెలిపి తన ప్రతిన కాపాడుమని వేడును. అర్జునుఁడు సుభద్రపైఁ గల గాఢానురాగమున తత్‌క్షణమే చిత్రసేనునకు నభయ మొసంగును. పిదపఁ జిత్రసేనుని వధింపఁ బ్రతిన పూనినది శ్రీకృష్ణుఁ డని తెలిసి, పరితపించును. సుభద్ర, తాను పొరపాటునఁ జేసిన ప్రతినకు క్షమాపణ వేఁడును. అర్జునుఁ డేమి చేయుటకును దోఁపక చింతించుచుండ, నారదుఁ డేతెంచును. అర్జునుఁడు నారదప్రేరితుఁడై సుభద్ర ప్రతినను గాపాడుటకుఁ దీర్మానించి, అవసర మైనచో శ్రీకృష్ణునితో యుద్ధము గావించుటకు నిశ్చయించును.

ఐదవ అంకము

రంగము:— (1) నిర్జనప్రదేశము. కృష్ణార్జునులు యుద్ధమునకు సంసిద్ధు లగుదురు.

రంగము:—(2) రణరంగము. కృష్ణార్జునులు యుద్ధమునకుఁ గడంగ, సుభద్ర యడ్డపడి సంధి యొనర్చును. ప్రాణసంరక్షణముఁ జేసినం దులకుఁ గృతజ్ఞతాసూచకముగాఁ జిత్రసేనుఁడు, ఇంద్రుఁడు తన కొసం గినయుంగరమును సుభద్రకు సమర్పించును.

---

# నాటకమునందలి ముఖ్యపాత్రలు.

---

పురుషులు

| | | |
|---|---|---|
| ఇంద్రుఁడు | ... ... | దేవనాథుఁడు |
| గాలవఋషి | ... ... | ఋషిశ్రేష్ఠుఁడు |
| నారదుఁడు | ... ... | దేవముని |
| కృష్ణుఁడు | ... ... | ద్వారకానాథుఁడు |
| అర్జునుఁడు | ... ... | కృష్ణునిబావమఱఁది |
| చిత్రసేనుఁడు | ... ... | గంధర్వుఁడు |

స్త్రీలు

| | | |
|---|---|---|
| సుభద్ర | ... ... | అర్జునునిభార్య |
| సంధ్యావళి, రత్నావళి | ... | చిత్రసేనునిభార్యలు |
| ఊర్వశి | ... ... | దేవవేశ్య |

# ఈశ్వర ప్రార్థన



ఎవ్వనిచే జనించు జగ - మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బర-మేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ - డెవ్వఁడు సర్వముఁ దాన యైనవాఁ
డెవ్వఁడు, వాని నాత్మభవు - నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.

క. విశ్వకరు విశ్వదూరుని
విశ్వాత్మకు విశ్వవేద్యు - విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు
నీశ్వరునిం బరమపురుషు - నే భజియింతున్.

# గాలవఋషి నాటకము

లేక

# చిత్రసేనోపాఖ్యానము

——:o:——

## మొదటి అంకము—మొదటి రంగము

[ఇంద్రునిసభామంటపము—ఇంద్రుఁడు సింహాసనాసీనుఁడై యుండును. ఒక ప్రక్కన నారదుఁడు మొదలగు ఋషులును, మఱియొక్క ప్రక్కన జయంతుఁడు మొదలగు దేవతలును ఉచితాసనముల పై నధిష్ఠించియుందురు. ఊర్వశి మున్నగు నప్సరఃకాంతలు ఆడుచును, పాడుచును ఉందురు. చిత్రసేనుఁడు నిలువఁబడి యుండును.]

ఇంద్రుఁడు—ఆహా! తాపసోత్తములారా! అమరులారా! గానమునకుం గల మహిమ అపారముగదా! ముల్లోకంబుల నిట్టి వశీకరణ శక్తి మఱిదేనికైనఁగలదా? చతుర్దశభువనంబులఁ గల సమస్త జీవరాసులకుఁ గూడ గాంధర్వవిద్య మహానందసంధాయక మగును. సురలైనఁ గిన్నరులైన నరులైన మఱెవ్వరైననుండుఁడు, ఎట్టి దుఃఖసాగరమున మునింగియున్నను, సంగీత శ్రవణమాత్రంబున, తమ దుఃఖములన్నియు మఱచి ఆనందమున నోలలాడకమానరు. వేయిమాట లేల?

సీ. అఖిలలోకము లేలు నాదిమూర్తులు మూగు
రనుగూడ వ్యామోహమునకుఁ దార్చు,
ఆబాలగోపాల మఖిల ప్రపంచంబు
నలరించు దుఃఖంబు లపనయించి,
పశుపక్షి క్రిమికీట పన్నగాదులకైనఁ
దన్మయానందవర్తన ఘటించు,
బ్రహ్మపదార్థమై భాసిల్లు నెందు నా
నందమే బ్రహ్మ మన్నందువలన,
గీ. సప్తలోకాధిగమ మహాసౌఖ్యదాయి
సప్తసుస్వర ప్రస్తారసరణిఁ గలిగి
నాదకళ పెంపుగాంచును నారదాది
దేవమౌనీంద్రవినుత మై దివ్యమహిమ.

[నారదునిచూచి] ఈవిషయమున మీరు ఏమి ఆనతిత్తురో వినఁగోరెద?

నారదుఁడు—శచీధవా! సత్యము, సత్యము. గానకళామహిమను సహస్రశిరస్కుం డగు నాదిశేషుఁడైన సమగ్రముగ వర్ణింపఁ జాలఁడనిన. ఇఁక మాబోంట్లు ఎట్లు సమర్థు లగుదురు?

శా. సంగీతమ్మున, సర్వలోకమునకున్, సౌఖ్యానుభావంబు, స
ర్వాంగీకార్యమె, యందునున్, శుకపికవ్యాహారమాధుర్య ము
ప్పొంగం బాడెదు, నూర్వశీప్రముఖలౌ పూఁబోండ్ల గానోత్సవం
బుం, గీర్తింపఁదరంబె, నీకొదవె నెప్డున్, దద్రసాస్వాదముల్.

[చిత్రసేనునివంక దిరిగి] చిత్రసేనా! ఈనారీమణులనెల్లర నృత్యగాన విద్యలయందు సుశిక్షితలఁ గావించినది నీవేకదా?

చిత్రసేనుఁడు—మహాత్మా! సర్వమును భవదనుగ్రహామే. నే నిందు నిమిత్తమాత్రుఁడ.

ఇంద్రుఁడు—చిత్రసేనా! నీ ప్రవీణతకుఁ జాలసంతసించితి. ఇఁకను గొంత సేపు ఈసభ సలంకరించిన పూజ్యుల కానందము గలుగఁ జేయుటకై, నృత్యగానంబులఁ గొనసాగింప ఈ చానల నియమింపుము.

నారదుఁడు—సంగీత శ్రవణమున, తృప్తి నొంది చాలునని ఎవరు చెప్పఁ గలుగుదురు? ఎంత సేపు వినినను ఇంకను వినవలెనను ఆసక్తియే పెరుగుచుండుఁగాని, తనివియనునది ఎన్నఁడును గలుగదు.

ఇంద్రుఁడు—కానిండు; మఱియొక గేయము, ఆలాపనచేసి వీనుల విందొనరింపుఁడు. శ్రమయని యెన్నఁగూడదు.

నారదుఁడు—ఇం దేటి శ్రమ? గానవినోదమువలన గాయకులకును శ్రోతలకునుగూడ ఆనందము కలదు. సరే కానిండు.

[అప్సరసలు మఱియొకపాట పాడి నాట్యముచేయ సభ్యులందఱును దానిని శ్లాఘింతురు.]

ఇంద్రుఁడు—చిత్రసేనా ! ఈ రమణుల నిట్లసమానగానకళాకోవిదలం గావించినందులకు నీ కేమి యొసంగినను హెచ్చుకాఁజాలదు. కాన నీయిచ్చవచ్చినదానిం గోరుము. ఒసంగెద.

[చిత్రసేనుని చెవిలో, ఊర్వశి ఏమో మెల్లనఁ జెప్పను.]

నారదుఁడు—ఆహాహా ! ఎంతటిభావప్రపూర్ణమగు గేయము. ఈయది మహోన్నతమగు నీతిని బోధించుచున్నది. మహేంద్రా! గ్రహించితివిగదా ! అష్టమహిషులును, అఱువదియాఱువేల మంది గోపికలును, నిరంతరము దన్నుఁబరివేష్టించి సేవించుచుండినను, చకితేంద్రియుఁడుగాక, దృఢచిత్తుఁడై యలరారుచుండు, ఆపరమపురుషుఁడు, వాసుదేవుఁడు, భక్తవత్సలుఁడు, శ్రీగోపాలకృష్ణమూర్తియే మనకు శరణ్యమని, కవి యిందు

వివరించె. దీని ముఖ్యాంశమేమన, స్త్రీలచమత్కారములంజూచి పురుషులెన్నఁటికిని మనస్థైర్యము గోల్పోవఁగూడదనియే! చిత్రసేనా! ఈ సారాంశమును మఱవకుందువుగాక.

చిత్రసేనుఁడు—త్రిలోకాధినాథా! భవదనుగ్రహమున దాసున కెట్టి కొఱంతయును లేదు. తాము సెలవిచ్చితిరిగాన కోరుచుంటిని. దేవరకెంగేల నలరారు రమణీయాంగుళీయకమును కటాక్షింప ననుగ్రహింపుఁడు.

ఇంద్రుఁడు—చిత్రసేనా! ఏమిసంశయము. అట్లే కైకొమ్ము. [ఉంగరమునుతీసియియ్యఁగఁ జిత్రసేనుఁడునమస్కరించుచుఁ గైకొనును] జయంతా! తక్కుఁగల రంభోర్వశీమేనకాతిలోత్తమాది దివిజ కాంతలకుంగూడ వాంఛితార్థంబుల నొసంగుము.

జయంతుఁడు—చిత్తము. భవదాజ్ఞానుసారమే కావించెద.

ఇంద్రుఁడు—మహర్షిపుంగవులారా! నమస్కారపురస్సరంబుగ భగవదాశీర్వాదముల నర్థించుచున్నాఁడ.

ఋషులు—విజయోస్తు, విజయోస్తు.

ఇంద్రుఁడు—ఇఁకను సభను జాలింతము.

[సభ ముగియును]

నారదుఁడు—చిత్రసేనా! [ఓరఁగాఁ బిలిచి] నే నుడివిన విషయము మఱవకుందువు గాక. [అందఱును నిష్క్రమింతురు]

రంగము ముగిసినది.

# గాలవఋషి నాటకము
లేక
# చిత్రసేనోపాఖ్యానము

మొదటి అంకము—రెండవ రంగము

---

ఇంద్రసభాంతికము

సంధ్యావళి—[విచారగ్రస్తయై ప్రవేశించుచు] అకటా! నేనెంతటి భాగ్యవిహీననైతిని! నారీలోకంబున ననుఁ బోలువారెవరైన ఈ ప్రపంచమునం దుండిరా? లేక యిప్పుడున్నారా? అట్టివారలు ఇఁకముందైనఁ బుట్టఁగలరా? అట్టి దురదృష్టవతిని నేనొక్కతె నుండినఁ జాలదా? ఎల్లవారికినిఁగూడ నాగతియే యేలకలుగవలయును? వలదువలదు. హా! విధాతా! నన్నేల యిట్టిస్త్రీరూపమున సృజించితివి? ప్రపంచంబునఁగల నారీమణులందఱును తమ ప్రియభర్తల ప్రియలాలనంబుల నుల్లసిల్లుచు ఆనందించుచుండ నన్నుమాత్ర మిటుల భర్తృవియోగసంతప్తం గావించి యలంచుట యేటిఘనత? అయ్యో! అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన ప్రాణనాథుఁడే నిర్దయుఁడై నను త్యజించియుండ, నిఁక దైవమును దూఱనేటికి? జీవితేశ్వరా! నే నెన్నఁడైనను మీపట్ల నెట్టియపచారమైనఁ గావించియుండిన నన్ను నిరసింపఁదగును. నేను మీ కెట్టిలోపమును గావింపలేదే? ననుఁ బరిత్యజింప నాదోషమేమి? మహేంద్రసభ కేఁగి నేఁడే మరలివచ్చెదనని చెప్పి మీరు నన్ను విడిపోయి నేఁటికి మూఁడు

నెల లాయెనే? నన్నెడఁబాసిన దాదిగా భీకరవియోగవహ్ని సంతప్తస్వాంతనై కంటికి మంటికి నేకధారగ నలమటించుచుంటినే. నన్నిట్లుపేక్షింపఁబాడియా? ఇదియే యదనని అనంగుఁడు కుసుమశరనికరంబుల నా సకలాంగంబులఁ బాడిచేయుచున్నవాఁడే? నా కొక్కదిన మొకయుగముగఁ దోఁచుచున్నదే? విరహార్తిచేఁ గృశించి నామేనిప్పుడు సామేనాయెనే? శల్యావశిష్టనైయుంటినే? ఇప్పుడు మీరు నన్నుఁ జూడఁగలిగినచో నాకు మీపైఁగల ప్రేమాధిక్య మిట్టిదని ఇపుడైన గుర్తింపఁ గలుగుదురుగదా? హా ప్రాణనాథా! ఎంతటి కాఠిన్యము! వెఱ్ఱినై మిమ్ముల నిందింపవలయును? నా కొఱకే మీరు ప్రాణనాథులైయుండిన నన్నిట్లు పరిత్యజించియుండరు. ననుఁ బోలు వారికెందఱికి మీరు ప్రాణనాథులై యుంటిరో. నేనేమి యెఱుంగుదును? [దీర్ఘ యోచన నభినయించి] మహేంద్ర సభను వీడి నానాథుఁడు, ఈమార్గమున నేరుగా రావలయు. సభ ముగిసినదని వింటినే; ఏలకో జీవితేశ్వరుఁడు ఇంకను రాలేదు? ఒకవేళ వేఱొకమార్గంబున రత్నావళీమందిరమున కేఁగి యుండునా? ఆ మహేంద్రుఁడు నా హృదయేశ్వరుని సామర్థ్యమునకు మెచ్చి, అంబరవీథిని విహరింప ననువగు విమానమును గూడ నొసంగియున్నాఁడుగదా! అద్దాని నధిరోహించి, స్వేచ్ఛావిహార మొనరింప, నా నాథున కిప్పుడు మఱింత సౌకర్యమేర్పడినది. అయ్యో, రత్నావళీ! రత్నావళీ! నీకిది తగునా? నేనుఁగూడ నినుఁబోలు మానవతినేగదా? నాథుఁడు ననుఁగూడ నగ్నిసాక్షిగ మంత్రవిధిని బరిణయముకాలేదా? అట్టి నేను ప్రాణేశ్వరుని సాహచర్యము నభిలషించుట యసహజమా? ఛీ! ఛీ! ఏమి నా బుద్ధిమాంద్యము! ప్రేమింపవలసిన ప్రాణనాథుఁడే విముఖుఁడైయుండ నీకనాసపత్నికి నాపై నెనరు

లేదనియూ నేను చింతించుటకు? మఱియు నా నాథుఁడు నిరంతరమును నాచెంతనే యుండవలెనని నే నిర్బంధింపలేదే? ఇరువురి నొక్కరీతిగా నిష్పాక్షికప్రవృత్తి నేలుకొను మనిగదా నేను కోరి యుంటిని. అట్లుండ నన్నిట్లు నిరాకరింపవచ్చునా? అయ్యో! ఇంకను దానిచిత్రములు నే నేమని తెలుపుదాన? చెల్లెలా! నాథునిజాడ నీ కేమైనఁ దెలిసినదా? యని యడుగ, అయ్యో, అక్కా, నేనేమియెఱుంగుదును? నాథుఁడు నామోముఁ జూచి నాల్గునెల లాయెనని కన్నులు పల్కి వేఁడ్పులఁ గథ సాగించును. నేనిందు నెవరిని నమ్మఁగలను? ఎవరిని దూషింపఁగలను? నన్నే దూషించుకొందుఁగాక.

చ. సుమసుకుమారమైన మనసుల్ గలవారిని, గాంతలం, గడుం
గుములఁగఁ జేయు ధాత, కఱకుల్ మనసుల్ గలవారిఁ గృత్రిమా
క్రమవిషమప్రవృత్తులఁ గాంతులఁ గూరిచి, యక్కటక్కటా!
శ్రమములు దుఃఖముల్ గుడువ, సాధ్వుల నేల సృజించెనో కదా?

ఛీ! స్త్రీజన్మము ఏటిజన్మము? సకలకష్టములకును నాలవాలమై యున్నది. ఎన్నఁడును స్త్రీలై జనింపఁగూడదు.

[నారదుఁడు ప్రవేశించును]

నారదుఁడు—సత్యము, సత్యము.

సంధ్యావళి—[ఆశ్చర్యము చూపట్టుచు] ఆహా! నారదమునీంద్రా! రండు. ఇదె నమస్కరించెదను. [నమస్కరించును]

నారదుఁడు—దీర్ఘసుమంగలీ భవ! సంధ్యావళీ! ఏమిది! నీవిందు నొంటరిగ నిలిచి చింతిల్లుచున్నావు? కారణ మేమి?

సంధ్యావళి—స్వామీ! త్రికాలవేదులైనమీ రెఱుంగనిది ఏమికలదు? హృదయేశ్వరుఁడు నన్నువీడిపోయి మూఁడునెల లైనవి. అతని సందర్శనము లభించెనేని మరల నా గృహాంబునకుం గొనిపోఁ

గ్గోరి నేనిందు ననుదినమును నానాథునికొఱకు వేచియుండుదాన. కాని మన్నాథుఁడు నాకంటఁబడకుండఁగ నేవెటకో చనుచున్నాఁడు. ఇదియే నా సంతాపకారణము. స్వామీ! నిత్యము ఇంద్రసభ నుండి నానాథుఁ డెందేఁగుచున్నాఁడో దయచేసి నా కెఱింగింప వేఁడెద.

నారదుఁడు—అతఁ డెచటికి పోవునని నీయనుమానము?

సంధ్యావళి—నాసపత్నియగు రత్నావళియింటికే పోవుచున్నాఁ డని నేఁదలంచితిని. నే నావిషయమునుగూర్చి దాని నడుగ నాథుఁడు తన మందిరమున కేతెంచి యెంతకాలమో యయ్యెనని ఆకాంత పలికె.

నారదుఁడు—రత్నావళి సత్యమే పలికెను. అతఁడచటికి పేఁగుటలేదు.

సంధ్యావళి—[ఆతురముతో] స్వామీ! మఱి యెచట నున్నారు?

నారదుఁడు—చిత్రసేనుని విచిత్రచరితము నీ వెఱుంగవా? మూఁడు నెలలనుండి యూర్వశీమందిరాంతరమున బందిగాయున్నాఁడు.

సంధ్యావళి—ధర్మపత్నులగు మమ్మిరువురఁ బరిత్యజించి, ఇపు డతఁ డా పడుపుఁజేడియకుఁ బాదదాసుఁడయ్యెనా? ఎంతకష్టము!— ఎంతకష్టము!

నారదుఁడు—సంధ్యావళీ! విద్యావతివగు నీవుగూడ కాంతలకు సహజ మగు శీఘ్రకోపమే చూపితివిగాని, కార్యసాధనానుకూల మగు సైరణ నోకించుకయుఁ జూపవైతివే? అన్యకాంతాదూషణమున ఆత్మకార్యసాఫల్యము చేకూరునా?

సంధ్యావళి—అయ్యో స్వామి! నా కేమియుఁ దోఁపకున్నది. కర్తవ్య మేమి?

నారదుఁడు—కర్తవ్యమా? భర్తను స్వాధీనపఱచుకొనుటయే!

సంధ్యావళి—అ దెట్లు సాధ్యమగునో తెలుపవలెతిరే ?

నారదుఁడు—నే నొకపన్నుగడఁ బన్ని అతఁడు నీకడకు అచిర కాలములోనే వచ్చునట్లు చేసెదను. దేవేంద్రుఁడు ఆతని కొసంగిన దివ్యాంగుళీయకము ఆతనికొనవ్రేల నున్నది. అద్దాని ఊర్వశికి నియ్యనెంచియున్నాఁడు. నీవెట్లులైన నాతని వశపఱచుకొని,ఆయుంగరము నాతఁడు నీకొసంగునట్లు చేసికొనవలయు. ఏ మెలనాగ, తనవ్రేల నాయుంగరమును ధరించునో, ఆకాంతామణికి, తన్నాథుఁడు నిరంతరము పాదాక్రాంతుఁడై యుండఁ గలఁడు. ఆయుంగరమున కిట్టిమహిమగలదు. కాన నెఱింగించితిని. అందులకుఁ జేయఁదగిన వంతయును సమర్థురాలవగు నీకు వేఱుగఁ దెలుపవలయునా? ఎట్లులైన నీసర్వశక్తుల వినియోగించి దానిం గైకొనుము. నేను పోయివచ్చెద.

సంధ్యావళి:—స్వామి! అటులే గావించెద. [నారదునికి నమస్కరించును. నారదుఁడు వెడలును.]

సంధ్యావళి:—ఇప్పుడుగదా నాప్రాణనాథుని సత్యవృత్తాంతము తెలియఁగలిగితిని. నే నెంతఁ దప్పుదలఁచితిని. నిష్కారణముగ రత్నావళిని నిందించితిని. ఎట్టిదిట్టలనైన తన మోహపాశమున బంధింపఁజాలిన ఆగట్టివాయి, ఆయూర్వశివలలోనే, నానాథుఁడు, చిక్కుకొనెనే! ఇఁక నీతని వశంవదుని చేసికొనుట ఆ దేవకన్యకు ఏమిలెక్క? దీనికిఁదోడు ఈ యుంగర మొక్కటి దాపరించెను. [యోజన నభినయించి] కానీ! మాతము. నారద ముని చెప్పినరీతిని ఎట్లులైనను ఈదారినే రాగలఁడు. అదిగో! ఊర్వశియింటికిఁ బోవలె నని కాఁబోలు, ఎంతో ఆతురతతో వచ్చుచునేయున్నాఁడు. ఉ! దానినననేల ? ఈయెడ కేతెంచి, నానాథుఁడు ఏమి చేయగలఁడో చాటుననుండి చూచెదఁగాక.

[అని దాఁగియుండును. చిత్రసేనుఁడు మఱియొక ప్రక్కనుండి యేతెంచును.]

చిత్రసేనుఁడు:—ఇం దెక్కడను ఊర్వశి కనఁబడకున్న దేమి? నారదముని తెలిపినస్థానము ఇదియేకదా! ఇందున కెట్టిసంశయము లేదు. మునీంద్రుని కటాక్షమున నీయంగుళీయకమునందలి మహిమను ఇప్పుడుగదా తెలియఁగలిగితిని. అత్యల్పమగు నీయుంగరము సర్పంపుమని ఈయూర్వశి, వేలమై, యిట్లుల బోధించుచున్నదని, నేనప్పుడు తలంచితిని. దానియందుంతమహిమ కలదని, ఇప్పుడు తెలియుటచే నాకానంశయము తొలంగినది. నేను తన్నెప్పుడును బరిత్యజింపకుండుటకే, ఆయూర్వశి నన్నర్థించియుండును. నాకిరు వురుభార్యలు గలరని ఊర్వశి లెస్సగా నెఱింగియున్నది. కాన, నేను, నిరంతరము తన్నెడఁబాయకుండక, ఎన్నఁటికైనఁ ద్యజింతు తునేమో యనుసందియమున, నట్టివియోగము, మాయిరువుర కును గలుగకుండుటకే, ఆమె యీయుంగరమును బడయఁ గోరెను. ఆనాఁడు దేవనాథుని, నేనర్థించినప్పుడు, ఆడినమాట తప్పఁజాలక, విధిలేక, కొంత యసమ్మతితోనే, యాతఁడు ఈ యుంగరము నొసంగినట్లుగూడ నాకప్పుడు పొడకట్టినది. ఎటు లైననేమి? ఇట్టి అమూల్యాంగుళీయకము నాపూర్వపుణ్యవిశేష మువనే, నాకు లభించినదనుట నిశ్చయము. మూఁడునెలలనుండి నే నెంత ప్రయత్నించుచుండినను, నామనోరథ మీడేరక పోయెను. నేఁటికి నాయభీష్టము నెఱవేఱఁగలదు. ఏమి! ఊర్వశి ఇంకను రాకున్నది? నారదుఁడు అసత్యమాడువాఁడు కాఁడే? నీకొఱకే వేచియున్నదని ఆమహర్షి చెప్పెనే కాని, నాకొఱకు వేచియున్నవా రెవరో అతఁడు స్పష్టముగా తెలుపఁడయ్యె. అయినను నాకొఱకు మఱెవ్వరిందు వేచియుందురు? ఆయూర్వ శియే యుండవలయును. విలాసార్థముగ నొకవేళ, ఆసతి

యించెంద్దైన దాఁగియున్న దేమో, వెదకి చూచెదను. ఇది శుక్ల పక్షమే యైనను ఈ ప్రదేశంబున భూరుహశాఖలు ఒండొంటిచెట్టఁ బట్టి దట్టముగ నల్లుకొని యుండుటచే, చంద్రకిరణము లందు ప్రసరింప వీలులేని కతమునఁ గాఁబోలు ఇందు కాఱుచీఁకటులే క్రమ్ముకొని యుండెను.

సంధ్యావళి:—[మఱుఁగుననుండి వచ్చి] ప్రాణనాథా!

చిత్రసేనుఁడు:—ఆహా! ఊర్వశీ!

సంధ్యావళి:—ఊర్వశియా! ఇఱువది గడియలును మీకు ఊర్వశీ నామస్మరణతప్ప వేఱుచింతయే లేనట్లున్నది.

చిత్రసేనుఁడు:—ఓహో! రత్నావళియా! చీఁకటిలో గుర్తింపఁజాలక నే నట్లంటిని, మన్నింపుము.

సంధ్యావళి:—ఇఁక మిగిలిన వారి పేరులన్నియు వరుసగా నేకరువు పెట్టుఁడు. మొట్టమొదటిది ఊర్వశి; రెండవది రత్నావళి; ఇఁక మూఁడవవారెవరు? సంధ్యావళిపేరు కట్టకడపటనైన వచ్చునో, లేక రానేరాదో?

చిత్రసేనుఁడు:—సంధ్యావళీ! ఏల యిట్టిమాటలాడెదవు? నిన్ను నేను గుర్తించితినో, నీ వేమందువో చూతమని, పరిహాసార్థ మిట్లు నుడివితిని.

సంధ్యావళి:—సరేగాని, మీ రిట కేల వచ్చితిరి?

చిత్రసేనుఁడు:—నిన్నుఁ జూచుటకే!

సంధ్యావళి:—నన్నుఁ జూచుటకుకాదు. ఊర్వశిని జూచుటకే యని నిజము చెప్పుఁడు. ఏల కల్లలాడెదరు?

చిత్రసేనుఁడు:—ఊర్వశిని జూచుటకందు వేల? నిన్నుఁజూచుటకే వచ్చితిని. నే నబద్ధమాడువాఁడనా? నీ విట్లేల కోపగించుకొందువు? వలదు.

సంధ్యావళి:—నా కేటికోపము? మీరు సత్వరంబుగ నేగకున్న, ఆ యూర్వశికి మీపై నాగ్రహము కలుగునేమో! ఇందేల తడసెదరు? శీఘ్రముగ పొండు!

చిత్రసేనుఁడు:—ప్రియా! నీవేల ఇట్లు భ్రమఁజెందెదవు? నాపలుకులు శాంతముగ నాలకింపుము.

సంధ్యావళి:—చాలును, నిలుపుఁడు. ఈమూఁడు నెలలనుండియు, విధిలేమిచే, ఇంద్రసభయందుండవలసిన కాలమునందు తప్ప, తక్కిన వేళలయందంతయును మీరు చేయుచున్న ఘనకార్యము ఆ యూర్వశి పాదసంసేవనమే కదా.? మందమతినై, నిష్కారణముగ, నేను ఆరత్నావళిని నిందించుచుంటిని. ఇప్పుడు నిజమును కనుంగొనఁ జాలితిని.

చిత్రసేనుఁడు:—సంధ్యావళీ! నీవెట్లో యిట్టిభ్రమకుఁ బాలైతివి. ఇది సరిగాదు. ఈమూఁడు నెలలనుండియు నాకా దేవేంద్రసభలోఁ దీరనిపని కలిగియుండెను. క్షణమైన విశ్రాంతి లేకుండెను.

సంధ్యావళి:—ఔనౌను! నేనంతయు నెఱుంగుదును. పాపము మీకు తీరుబడియే లేదుకాఁబోలు! ఆ! ఊర్వశియింటికి పోవుటకో? జీవితేశ్వరా! మీధర్మపత్నులమగు రత్నావళియును నేనును నుండ అగ్నిసాక్షిగ మీరు మాకొసరించిన ప్రమాణములనెల్లఁ బోనాడి, కులటయు, నీచురాలునగు నా దివిజవేశ్యయందలి మోహమున, మీరిట్లు స్వధర్మమును వీడుట పాడియగునా? నాయందుఁగల ప్రేమను విడనాడుటకొఱకైన, నన్నీమూఁడు నెలలలో నొక్కనాఁడైనఁ దలంచియుందురా? నేనును, మీకులాంగననైయైన తలంపక పోతిరికదా?

చిత్రసేనుఁడు:—సంధ్యావళీ! నామాటయందు నీకేల నమ్మకము కలుగదు? నేనాయూర్వశియింటికి నేల పోవలసివచ్చెనో గ్రహింపఁజాలవైతివిగా? మహేంద్రసభయందు ఆమందగామిని నృత్యగా

నంబుల నొసర్చవలసి యుండుటచే, నే నావిద్యల నామెకు నేర్ప వలయు నని మహేంద్రుఁడు ఆజ్ఞాపించుటచే, నామెయింటికిఁ బోవలసి వచ్చెను.

సంధ్యావళి:—అటులనా! మీరామెయింటికేఁగి ఆమెకుభరతశాస్త్రము నేర్పితిరా! మఱి యామె మీ కేశాస్త్రమును నేర్పినది?

చిత్రసేనుఁడు:—అన్నులమిన్నా! నన్నన్యథా భావింపకుము. నీవు నవ యౌవనవిలాసవతివై యున్నదాదిగా నీపై నెలకొనిన, నా గాఢానురాగము నేఁ డెటుల తొలంగునని తలంచితివి? నా హృద యేశ్వరివైన నిన్ను కలనైన మఱవఁగలనా ?

సంధ్యావళి—అవునవును !

క. నవనవవిలాసవిభ్రమ
యువతీసంభోగరుచిసముత్సాహు లహో
యువపురుషులు వారికిఁ గ్రొ
త్త వింతయుఁ బ్రాఁత రోఁత తథ్యముసుమ్మీ !

పురుషులు నవయౌవనవిలాసవతీప్రియు లని నేనెఱుంగనా ? క్రొత్త వింత ప్రాఁతరోఁత. ఇదియేకదా పురుషలక్షణము !

చిత్రసేనుఁడు—దేవీ ! నే నట్టియల్పమతి నని తలంపకుము. ధర్మపత్ని వైన నిన్నుఁ బరిత్యజించి బహుభర్తృకయైన యొక వేశ్యను బ్రేమించుటకు నే నంతనీతిదూరుఁడ నని తలంచుచున్నావా?

సంధ్యావళి—నాథా ! ఇది సత్యమేనా? అట్లైన మన మందిరమునకుఁ బోవుదము రండు.

చిత్రసేనుఁడు—అటులే వచ్చెదనుగాని యత్యవసరముగ నేదోయొక విషయమునుగూర్చి నేఁడే తనతో మాటలాడవలయునని నారద

మునీంద్రుఁడు ఆనతియొసంగె. కాన, నిప్పుడేపోయివారిని సందర్శించి వారియానతిగొని కడుశీఘ్రముగ నీమందిరమునకు నచ్చెదను. నీవు పొమ్ము.

సంధ్యావళి—అయ్యో ప్రాణనాథా! మూఁడు నెలలనుండి నాకంటనే పడకుండి భగవదనుగ్రహమున నేఁ డెట్లో హఠాత్తున దర్శన మొసంగి, యిప్పుడే పోయెదననిన నే నేమనఁగలదానను? ఇంక నే నెట్లు మనఁగలఁదాన? అయినను నారదమహామునియాజ్ఞ యనిన, పోవల దనుటకు నో రెట్లు లాఁడును? మీారు కడు శీఘ్రముగ రావలయును. నాథా! ఇదేమి? మీా వ్రేల నెంతయో కాంతితో నొప్పారు నీయది నూతనాంగుళీయకమువలె నున్నదే! ఏదీ! దీనిని నా కొసంగుఁడు. మీారు మరల వచ్చువఱకు దీనిని నా వ్రేలధరించి యానందించుచుండుదాన. ఇది చాలముద్దులొలుకుచున్నది.

చిత్రసేనుఁడు—అట్లే కైకొమ్ము. [అని మఱియొక యుంగరమును నియ్యఁబోవును].

సంధ్యావళి—[ఆ యుంగరము నొల్లక] నేను కోరినది ఇది గాదు. మీా కొనవ్రేలనున్న యీ యుంగరమునే నా కొసంగుఁడు.

చిత్రసేనుఁడు—ఆ యుంగరము నాకు దేవేంద్రుఁడు బహుమానముగా నొసఁగెను. దాని నితరులకు ఇయ్యఁగూడదు. మఱిదేనినైన నడుగుము.

సంధ్యావళి—ఓ నాను! అది నాకు ఇయ్యఁగూడదు. కాని ఊర్వశి మాత్రము ఇయ్యవచ్చునని ఆ దేవేంద్రుఁడు మీా కానతి నొసంగెను గాఁబోలు? నాథా! నా కన్నిసంగతులును దెలియును. నా కాయుంగరము తప్ప మఱేదియు వలదు.

చిత్రసేనుఁడు—సంధ్యావళీ! అట్లేయిచ్చెదను. [అని తీయఁబోయి] అయ్యో! ఇది చాల బిగిసికొనియున్నది. సావధానముగఁ దీయ వలయు. నారదమునీంద్రుఁడు నాకొఱకై యమునానదీతీరమున, చాలకాలముగా నిరీక్షించుచున్నాఁడు. నే నాలసించినఁ గుపి తుఁడై నన్ను శపింపఁగలఁడు. నేను పోయి వచ్చెదను.

సంధ్యావళి—ప్రాణనాథా! దానిని నాకిచ్చినఁగాని మిమ్ము నేఁ బో నియ్యను.

చిత్రసేనుఁడు—నేను మరల వచ్చిన వెంటనే నీ కిచ్చెద. [అని పాఱి పోవును].

సంధ్యావళి—ఆహా! ఇఁక నేమిచేయుదును. ఎంత ప్రయత్నించినను, ఆ యుంగరము నాకు లభింపదాయెఁగా. [కొంచెము యోజన నభినయించి] ఒక యూహ దోఁచుచున్నది. ప్రాణనాథునికి ఊర్వశిపై, అమితమోహము జనించిన ట్లున్నది. గాన, దాని వేషము ధరించి మరల నాపతిని సంధించి, ఆ యుంగరము పొందుటకు ప్రయత్నించెదను. [అని వెడలును. మఱియొక పార్శ్వమునుండి, రత్నావళి వచ్చును.]

రత్నావళి—ఏమి! ప్రాణనాథుఁడు ఎందును గానరాఁడయ్యె. ప్రాణ నాథుఁ డిందేయుండునని, నారదమునీంద్రుఁ డింతకుముందే నా కెఱింగించెను. కాని, నాథుఁడు కనంబడఁడయ్యె. ఇందెవ్వరో మాట లాడుచుండుధ్వని వినంబడియె. నేను వచ్చినంతనే నన్నుచూచి కాఁబోలు వారిరువురు నిటనుండి వెడలిపోయిరి! వారే, ప్రాణే శ్వరుఁడును, ఊర్వశియు నయి యుండనోపుదురు. ఆహా! మునీం ద్రుఁడు ఎఱింగించిన ఆయుంగరము నాకు లభింపక, ఊర్వశి కే చిక్కియున్నచో నాగతి యేమగునోగదా? నే నిప్పుడేమి చేయఁ గలను?

[మరల నారదుఁడు ప్రవేశించును]

రత్నావళి—స్వామి! మీ యాజ్ఞానుసారము నేనిందువచ్చి చూచితిని. కాని, నా నాథుఁడు, కనంబడఁడయ్యె?

నారదుఁడు—నేను చెప్పిన వెంటనే నీవు రాలేదు. అట్లువచ్చియుండినచో, నీపతిని జూచియేయుందువు. నీ వట్లుచేయక, దిద్దుకొని, తీర్చుకొని, శృంగారించుకొని, తీరుబడిగా వచ్చితివి. అతఁడెట్లు కనఁబడును?

రత్నావళి—మునీంద్రా! నా అపరాధము మన్నింపుఁడు. ఈ దీనురాలి ననుగ్రహింపుఁడు. నా నాథుఁడు, ఇపుడెం దున్నదియు నెఱింగింపుఁడు. ఆయుంగరమెట్లైన నాకు లభించునట్లు ఆశీర్వదింపుఁడు.

నారదుఁడు—అట్లైన వినుము. ఆయుంగరము నీకే లభించునట్లుఁ జేయుట నావలన సాధ్యపడదు. నీస్వశక్తివలననే నీవు దానిఁ బడయవలయును. ఆయుంగరము నాయూర్వశికి నొసంగుటకే నీ నాథుఁడు యమునానదీతీరమునకుఁ బోయియున్నాఁడు. నీవు కూడ శీఘ్రముగ నట కేఁగుము. నీవెనువెంట నేను నయ్యెడకరుగుదెంచెదను.

రత్నావళి—స్వామి! మీ యాజ్ఞానుసారమే చేసెదను. [అని నారదునికి నమస్కరించును. నారదుఁడు వెడలును] నేనుఁగూడ నిప్పుడే ఊర్వశీవేషమున నయ్యెడ కేఁగెదను. ఇదియే మంచియుపాయము. ఇఁక నాలసింపఁగూడదు. [పోవును]

రంగము ముగిసినది.

# గాలవఋషి నాటకము

లేక

# చిత్రసేనోపాఖ్యానము

—o—

## మొదటి అంకము — మూఁడవ రంగము

[యమునానదీతీరమునఁ బొదరిల్లు. చిత్రసేనుఁడు వచ్చుచుండును]

చిత్రసేనుఁడు—నారాయణోరుసంభవ యగు నా యూర్వశి దివిజలోకము వీడి భూతలమునకు వచ్చుటయు, తన్నిచ్చటఁ గలిసికొనవలయు నని నాకొ వర్తమానము పంపుటయుఁ జాల వింతగాఁ దోఁచుచున్నది. ఇందుల కేదో గొప్పకారణ ముండవలయును. కాని నా కిం చెందునుగూడ నాయూర్వశి కానరాలేదు. [నలువంకల తిలకించి] ఆహా! ఏమి యీ మనోహరదృశ్యము! సరిసరి—ఊర్వశి న న్నిచ్చటికి రావించినకారణము స్పష్టమయ్యె. ఇట్టి యపూర్వప్రకృతిరామణీయకము దివిజలోకవాసులకుఁగూడ దుర్లభము.

సీ. అలలపై డోలావిహారమ్ముఁ గావించు
నంచదంపతుల యొయ్యార మహాహా!
పసిఁడు వెన్నెలకాంతిఁ బిండారఁబోసిన
ట్లింపౌ నిసుకదిన్నె సొంపు లవుర!
కమలకహ్లారముల్, కారండవాదులు
వెలయించుఁ గను వీనువిందు లదిర!

పుష్పసౌగంధ్యసంపూర్ణము లగుసలి
నాలితెమ్మెరల వాహ్యాళు లరరె!

గీ. సకలలోకసమ్మోహనశ్రమముఁ జెందు
మన్మథున కీప్రదేశంబు మాఱు లేని
విజయసాధనరంగ మై వెలయు బళిర!
బాపురే! యమునాతటప్రాభవంబు.

[మరలఁ బరికించి] ఏమిది! ఊర్వశి యింకనురాలేదు. లేక యిద వఱకే వచ్చి నేనాలసించితి నని యలుకవలన నెందేని దాఁగియుండునా? చూతము. [అని కూర్చుండఁగ నడుగులసవ్వడి వినఁబడును] అదిగో! ఏదో యడుగులచప్పుడు వినఁబడుచున్నది. ఊర్వశియే యుండనోపు. పోయి చూచెద. [పోవును. మఱియొకపార్శ్వమునుండి ఊర్వశివలె వేషము ధరించినసంధ్యావళి వచ్చును.]

సంధ్యావళి—ప్రాణేశునికొఱకు నే నీప్రదేశమునందంతటను చాలసేప టినుండి వెదకుచుంటినిగాని నాకతఁ డెందును గానరాలేదు. అతఁడొకవేళ నవ్వలిగట్టుననున్నాఁడేమో? నేనచటికి నేఁగవలె ననిన, విఘ్నమార్గముననఁగదా పోవలయు. నేనటు లేఁగినచో అప్పుడు గమనవేగమున నామాఱువేషము ఇంచుక తొలఁగి పోయిన నన్ను వారు గుర్తింప నవకాశము కలుగును. అటులైన నాకా యుంగరము ఎటులు లభింపఁగలదు? ఆయుంగరము నాకు లభించువఱకు నన్నెవరును గుర్తింప కుండునట్లు నేను మెలఁగవలయును. అటుపిమ్మట వారు గుర్తించి నను జింత లేదు. నే నిందుల కేమిచేయుటకును దోఁపకున్నది. అదిగో! ఎవరో వచ్చుచున్నట్లున్నది. ఆహా, ఊర్వశియే! అది గూడ నాప్రాణనాథునికొఱకు వెదకుచున్నట్లే కనఁబడుచున్నది. ఆయూర్వశి నాప్రాణనాథుని గలిసికొనుటకుమున్నే, నేను దాని

కంటఁ బడకుండ, సంకేతస్థలమున కేఁగి చూడవలెను. [వేగముగ పోవును. మఱియొక ప్రక్కనుండి ఊర్వశివలె వేషముధరించిన రత్నావళి వచ్చును.]

రత్నావళి—ఏఁడీ ప్రాణనాథుఁడు? ఇందు లేఁడే. అయ్యో! మరల నీసారిగూడఁ గనుఁగొనఁజాలను గాఁబోలు? నారదమునీంద్రుఁడు చెప్పినరీతిని, ఆలసింపకుండ తత్క్షణమే బయలుదేఱి రావలయు నని నేను లేచుసరికి అపశకునము సంప్రాప్తమైనందున కొంచె మాలసించి బయలుదేఱితిని. ఈలోపుననే, అయూర్వశి ఇందు వచ్చియుండునేమో? ఆ దేవకామిని నానాథుని గలిసికొనుటకుముందే, నే నాతనిచెంతఁ జేరి, ఎట్లైన ఆ యుంగరము గ్రహించి దాని గర్వమునంతయు నడఁగించెద. ఇఁక నాలస్యము చేయరాదు. [ఒక ప్రక్కఁ బోవును. ఎదుటిప్రక్కనుండి, చిత్రసేనుఁడును సంధ్యావళియును వత్తురు.]

చిత్రసేనుఁడు—ప్రేయసీ, ఊర్వశీ! నీకొఱకై ఎంత సేపటినుండియో నే నిందంతయును గ్రుమ్మరుచుంటిని. లతానికుంజంబులందంతటఁ దిరిగి తిరిగి, వేసారితిని. అబ్బ! ఇప్పటికైన నీదర్శనము లభించుట భాగ్యమే. నీవానతి నొసంగినరీతిని మహేంద్రుండొసంగినయుంగరము నిదిగో కొనివచ్చితిని. కాని నీ కేటికి నాపైనిట్టిసంశయము? నీకాలిగోటికైనను, ఎనరాని ఆసంధ్యావళీ రత్నావళులకొఱకు నినుఁ బరిత్యజించి నేను మరల వారిచెంత కేఁగుదునా? ఇదిగో ఈ యుంగరము గైకొనుము. [మఱియొక్క ప్రక్కనుండి రత్నావళి వచ్చును. ఆమెను చూచి] ఆహా! ఇదేమి? అదిగో ఊర్వశి ఇట్లు వచ్చుచున్నది. ఇదేమి స్వప్నభ్రాంతివలె నున్నది.

సంధ్యావళి—ప్రాణనాథా! ముందుగా నా కా యుంగరము నొసంగి మఱి పొండు. [అని చేతిని పట్టుకొనును.]

చిత్రసేనుఁడు—విడువుము, విడువుము. [అని చేయి వదలించుకొని] అయ్యో! నే నెంతతప్పు చేసితిని! దేవీ, ఊర్వశీ! నే నొనరించిన యీచిన్నియపరాధమును, మన్నింపవలయును. నేను ని న్నిందు వెదకుచును దిరుగుచుండఁగా, ఈపాడురత్నావళి, నీవలెనే మాయవేషమును ధరించి—

రత్నావళి—ప్రాణనాథా! నే నింతలోనే "పాడురత్నావళి" నైతినా? [అని మాయవేషమును తీసి పాఱవైచును.]

చిత్రసేనుఁడు—ఆహా! ఇదేమి స్వప్నభ్రాంతి. నే నెంతతప్పు గావించితిని! ప్రేయసీ, రత్నావళీ! నాపై కోపగించుకొనకుమా! నేను—

రత్నావళి—నాతో మీ కేటిమాటలు? నేను "పాడురత్నావళి" నైతినే!

చిత్రసేనుఁడు—ప్రియా! చింతింపకుము. నామాట వినుము. పాడు సంధ్యావళి అని చెప్పవచ్చి తప్పఁబలికితిని.

సంధ్యావళి—[సమీపించి] ఏమేమి! నేను పాడుసంధ్యావళి నైతినే? [అని మాయవేషము తీసి పాఱవైచును.]

చిత్రసేనుఁడు—ఇదేమి విపరీతముగఁ ఘటిల్లించెను. సంధ్యావళీ—

సంధ్యావళి—పాడుసంధ్యావళి అని పిలువుఁడు. నాతో—

చిత్రసేనుఁడు—అయ్యో! ఇదేమిః ప్రాణసంకటము. రత్నావళీ—

రత్నావళి—పాడురత్నావళి యని పిలువుఁడు. నాతో—[ఊర్వశి వెనుకపార్శ్వమునుండి వచ్చి సంగతుల నరయుచుండును.]

చిత్రసేనుఁడు—అయ్యో! మీరిరువురు నీరీతిని నాపైఁ గోపగించుట పాడియా? అన్నిటికిని ఆపాపిష్ఠిఊర్వశియే కారణము. మీ రాపాడు ఊర్వశీవేషము ధరించి ఇచ్చటికి రానేల?

ఊర్వశి—[గంభీరముతో] అయ్యా! చిత్రసేనా! మీరు నుడివినమాటలు మఱవకుఁడు. నేను "పాడు ఊర్వశి" నైతినా? [అని ఆకాశమార్గమున నెగసిపోవును.]

చిత్రసేనుఁడు:—అయ్యో! ఊర్వశి, ఊర్వశి! [అని వెనుకనంటును.]

సంధ్యావళి, రత్నావళి—ఆ-ఆ-ప్రాణనాథా! [అని ఆకాశమార్గమునఁ జూపులు నిగుడ్తురు.]

సంధ్యావళి—అహా! ఏమిచేయుదును? వెంటనంటుఁదమన్నను విమానమెక్కి ఆకాశమార్గమున నతివేగముగాఁ జనుచున్నారే? [రత్నావళివైపు తిరిగి] అన్నిసంకటములకు నీవేకదా కారణము. నీవెందులకే ఊర్వశీవేషము ధరించి ఇచ్చటికి వచ్చి యింతయుఁ బాడుచేసితివి?

రత్నావళి—నీ వెందులకు వచ్చితివి? పోనీ మొదట వచ్చినందులకు ఆ యుంగరము నైనను గ్రహించితివా?

సంధ్యావళి—ఊర్వశివి నీవని తలంచి ఆయుంగరమును నాథుఁడు నీ కియ్యఁబోయెనే, అప్పుడైనను, మౌనము వహించి, యేల పుచ్చుకొనకపోతివి? లేనిపోనినిష్ఠురము లాడి కార్యము చెడి పితివి!

రత్నావళి—అయినదేమో అయినది. ఇఁక నేమి చేయఁగలుగుదుము? అక్కా! నామీఁదఁ గోపగించుకొనకుము. ఇఁక ముందు చేయవలసిన కార్యము యోజింతము. మనల నిరువురను మోసపుచ్చి ఆయుంగరమును, ఊర్వశియా పొందుట?

సంధ్యావళి—లేక, నీవుమాత్రమె పొందవలెనా?

రత్నావళి—అటులుగాదు. నెలకొకరుగా, మనమిరువురము ధరింతము.

సంధ్యావళి—నీవు చాల బుద్ధిశాలినివి. రమ్ము పోదము. ప్రాణనాథుని విమానము చాలదూరము వెళ్లినది. వెంబడించియు ఫలము లేదు. మనము గృహమునకు వెళ్లి అన్నియు యోజనచేయుదము. విధిని మార్చుట కెవరికి శక్యము?

క. తలఁచి ప్రయత్నించినపని
ఫలియించుట యనఁగఁ బుణ్యవంతుల కొదవ్రఁ
జెలి! యింతకు బెడిసెను మన
తలఁ పిఁక నేమగునొ? యెట్లొ దైవము తలఁపుల్.

[ఇరువురు నిష్క్రమింతురు.]

అంకము ముగిసినది.

# గాలవఋషినాటకము

లేక

# చిత్రసేనోపాఖ్యానము



## రెండవ అంకము— మొదటి రంగము

---

[యమునానదీతీరము: గాలవఋషియు, అతనిశిష్యులు నిత్యానందుఁడును, సత్యానందుఁడును ప్రవేశింతురు.]

నిత్య—స్వామి! ఈవైపునకు రండు. అబ్బా! మీరు జప మొనర్ప— అబ్బా! తగినస్థలము కాదు.—అబ్బా!

సత్య—ఏ మది ? ఇతఁడు చెప్పినంతలో—అబ్బా ! నన్నుఁ గూడఁ గుట్టుచున్నవి. అబ్బా !

నిత్య—అందులకే నేఁ జెప్పినది. అబ్బా!- స్వామి! దోమలకాటు— అబ్బా! అధికముగా నున్నది యిక్కడ-అబ్బా! అదిగో, ఆ యొడ్డున సౌఖ్యముగా నున్నది. అచ్చటికి-అబ్బా! పోదము రండు.

గాలవ—ఏమి యీవికటోక్తులు? అబ్బా! దోమలు కుట్టుచున్నవి. ఇందుండి శీఘ్రముగా వెడలుదము రండు. [మువ్వురును ఏటి యొడ్డుగాఁ బోవుదురు.]

సత్య—స్వామి! ఈస్థలము పరిశుద్ధముగా నున్నది. నీరు నిర్మలముగా నున్నది. ఇసుకదిన్నె గూడ నున్నది. ఇచ్చట మీయనుష్ఠానములు తీర్చుకొనవచ్చును.

నిత్య—[తనలో] దోమలకాటును లేదు.

గాలవ—అట్లయిన నీస్థలము శుద్ధిచేసి దర్భాసనము వేయుఁడు.

[శిష్యులు అట్లు గావింప, ఋషి ఆచమనము మొదలగునవి గావించును.]

నిత్య—[తోడిశిష్యునితో] అబ్బబ్బా! ఇచ్చట సన్నచీమలు కాళ్లను గఱచుచున్నవిరా!

సత్య—ఓరీ! సందడిచేయకుము గురువులు నిష్ఠయందున్నారు. అబ్బా! నాకాళ్లుకూడఁ గఱచుచున్నవి.

గాలవ—శిష్యా! అర్ఘ్యము విడువవలెను. ఉదకమును నాదోసిటిలోఁ బోయుము.

సత్య—అట్లే స్వామి! [అని దోసిటిలో ఉదకము పోయును. తత్సమయమున ఆకాశమార్గమునఁ బోవుచిత్రసేనుఁడుమ్మి వైచిన తమ్ములము గాలవఋషిదోసిటియర్ఘ్యమునందుఁ బడును.]

గాలవ—శిష్యులారా! నా అర్ఘ్యమునందు ఏదో బరువైనవస్తువు పడినది. అది యేదో తెలియలేదు. చూడుఁడు.

సత్య—[నిత్యానందునిఁ జూచి] ఏమిరా! మీఁదుగాఁ జూచుచున్నావు?

నిత్య—దోమలు చీమలు చాలక, పక్షులు ఏవైనను పైని బోవుచున్నవో యని చూచితిని.

సత్య—తాపసవర్యా! హస్తమునందలియుదకము ఎఱుపురంగు కలిగియున్నది.

నిత్య—[ఆఘ్రాణించి] ఆహా! ఏమిది? కమ్మనివాసన వచ్చుచున్నది. ఆహాహా!

సత్య—అయ్యోయ్యో! స్వామి! ఎవరో తమయర్ఘ్యమునందుఁ దాంబూలోచ్ఛిష్టము నుమిసియున్నారు.

గాలవ—[కోపముతో] ఏమీ? ఆలాగా!

నిత్య—స్వామి ! అవును. సందేహము లేదు. ఏలకికాయలు, లవంగ ములవాసన యెంత పరిమళించుచున్నది!

గాలవ—ఆహా! ఏపరమచండాలుఁడు నా అర్ఘ్యమును ఈరీతిగఁ బాడు చేసినాఁడు?

సత్య—స్వామి! ఇచ్చట నెవరును గనఁబడరే?

గాలవ—కొంచెము తాళుము. ఈదుష్కార్యము చేసినచండాలుని దివ్యదృష్టిం జూచి చెప్పెదను. [కొంచెము ఆలోచించి] నా యనుష్ఠానమును భంగముచేసినపాపి దేవలోకమున నాట్యాంగ నలకు నాట్యము నేర్పుచిత్రసేనుఁ డనుగంధర్వుఁడే! ఇప్పుడు కామాంధకారముతోఁ దనవిమానము నెక్కి ఉర్వశీగృహము నకు నేఁగుచున్నవాఁడు. ఈదుష్టునకుఁ దగినప్రాయశ్చిత్తమును గావింపవలయును.

నిత్య—స్వామి! మీరు ముందుగఁ బ్రాయశ్చిత్తము గావించుకొన వలయునే?

గాలవ—నిశ్చయము. నీవు తత్క్షణమే ఆశ్రమమున కేఁగి వలయువస్తు వులను సేకరింపుము.

నిత్య—చిత్తము. [తనలో] ఇచట చీమలబాధ చాలమిక్కుటముగా నున్నది. అబ్బా! [వెడలును]

గాలవ—ఆహా! ఈ పరమచండాలు నేమి చేయవలయు? వీనిని శపిం చినయెడల నాతపస్సునకుఁ గొఱఁత కలుగును. దీని కేయుపాయ మునుఁ దోఁపకున్నది.

సత్య—స్వామి! ఇదిగో వచ్చుచున్నారు!

గాలవ—ఎవరు ?

[నారదఋషి గానము చేయుచుం బ్రవేశించును]

నారదుఁడు—తాపసవర్యా! యిదె నారదుఁడు నమస్కరించుచున్నాఁడు.

గాలవ—నమో నమః. మునిశ్రేష్ఠా! రమ్ము.

నారదుఁడు—ఋషితిలకమా! మీ అనుష్ఠానములు అప్పుడే ముగింపఁబడినవా? చింతాక్రాంతులై యున్నట్టు కనఁబడుచున్నారు!

గాలవ—అనుష్ఠానము లింకను ముగియలేదు. ప్రారంభించునంతలోననే, అశుచి సంభవించినది.

నారదుఁడు—ఏమేమి? అశుచి సంభవించినదా? అట్టియశుచి యెద్దియో తెలుపుఁడు.

గాలవ—అయ్యో! అద్దానిఁ దలఁచినంతనే నామానస మెరియుచున్నదే!

నారదుఁడు—అంతటిదారుణకార్య మేమై యుండును? వినవచ్చునా?

గాలవ—అయ్యో! ప్రాతఃకాలమందుఁ బ్రభాకరునకు అర్ఘ్యమును విడుచుటకై ఉదకమును దోసిటియందుఁ గొనఁగనే, దేవసభయందు దేవదాసీజనులకు నాట్యము నేర్పు చిత్రసేనుఁ డను గంధర్వుఁడు, ఆకాశమార్గమున ఊర్వశీగృహమునకుఁ బోవుచు, తననోటియందలి తాంబూలోచ్ఛిష్టమును ఆకాశమునుండి నా దోసిటిలో విడిచెను.

నారదుఁడు—ఆహాహా! ఆదుష్టుఁడు అట్లొనరించెనా? నేఁడు మీతపమంతయు వ్యర్థమైనదే! ఆక్షణముననే ఆదుష్టుని మీ రేల భస్మీకరింపరైతిరి?

గాలవ—నేను జేయ నెంచిన నసాధ్యమా?

నారదుఁడు—అసాధ్య మగునా? ఇ దేమివింత! మీ కసాధ్య మైనదే దైనను గలదా? అయినను ఆవల నేమి చేసితిరి?

గాలవ——అదే యోజన చేయుచున్నాను. ఆపాతకుని శపించిన, నాతపమునకుఁ గొంత భంగము కలుగు నని అనుమానించుచున్నాను.

నారదుఁడు——అవును, అదియు నిజమే. అందునకు నొకయూహతోఁచుచున్నది. [యోజనతో] తాము స్వయముగా శపింపక పోయినను, ఈరాజ్యము నేలు శ్రీకృష్ణపరమాత్మునియొద్ద కేఁగి విన్నవించుకొన్న, అతఁ డెట్లయినను ఆపాపాత్మునికిఁ దగినశిక్ష విధించును. అతఁ డీరాజ్యము నేలు ప్రభువు గాన, ఆభార మాతనిదే యగును. నేఁడు మీ రుపేక్షించిన, తాపసు లెల్లరకును ముందు తప్పక ముప్పు కలుగుచునే యుండును.

గాలవ——వాస్తవము. తాపసులక్షేమము రాజులు తప్పక యరయవలసినదే! కృష్ణపరమాత్మునికడ కేఁగుటకు మీరుకూడ నాతో వచ్చెదరా?

నారదుఁడు——రావలయునా? ఆవశ్యక మైన వచ్చెదను.

గాలవ——మీ రవశ్యముగా రావలయు. గోపాలదేవునిచందము మన కందఱికిఁ దెలిసినదేకదా! మీరు నేతెంచినఁ గార్యము శీఘ్రముగ ననుకూల మగును.

నారదుఁడు——అట్లే వచ్చెదను. పోవుదము రండు.

గాలవ——ఇదిగో ఆశ్రమమున కేఁగి ప్రాయశ్చిత్తవిధులను దీర్చుకొని వచ్చెదను.

నారదుఁడు——అటులే కానిండు. మీరు మీ క్రియను సలుపుకొని, ద్వారకకు నేఁగి కృష్ణపరమాత్మునిఁ గనుఁగొనుఁడు. ఇంతలో నేనుగూడ నచ్చటికి వచ్చెదను. [గాలవఋషి వెడలినపిదప] ఈనాటకమున కిదే మూలము. ఇది అంత్యమున నెట్లు ముగియునో చూడవలయును. [నిష్క్రమించును.]

రంగము ముగిసినది.

———

# గాలవఋషి నాటకము

లేక

# చిత్రసేనోపాఖ్యానము

—:o:—

## రెండవ అంకము—రెండవ రంగము

—

[ద్వారకయందు కృష్ణునినగరు - ప్రాతఃకాలము.

కృష్ణుఁడు సుఖాసీనుఁడై సంగీతశ్రవణము చేయుచుండ, సేవకుఁడు ప్రవేశించును.]

సేవకుఁడు—స్వామి ! గాలవమహర్షి వచ్చుచున్నారు.

కృష్ణుఁడు—అలాగా ! ఎదురేఁగి శీఘ్రముగఁ దోడ్కొని రమ్ము. [సేవకుఁడు వెళ్లి గాలవఋషితోఁ బ్రవేశించును. కృష్ణుఁడు ఆసనమునుండి లేచి ముందునకు వెళ్లి] తపోనిధీ! నేఁడు నేను కృతార్థుఁడ నైతిని. నాగృహము పావనమైనది. ఈ ఆసనము నను గ్రహింపుఁడు.

గాలవ—['దీర్ఘాయుష్మాన్ భవ' అని ఆశీర్వదించి, ఆసనముపైఁ గూర్చుండి] పురుషోత్తమా! నారాకవలన మీసంగీతశ్రవణమునకు భంగము కలిగినందులకు మన్నింపవలెను.

కృష్ణుఁడు—అటులు గాదు. తాపసశ్రేష్ఠుల రగు తాము ఏదో కార్యార్థ మిటకు వచ్చియుండ, అక్కార్యమును బాటింపక, నాసుఖమును చూచుకొనుట ధర్మమా ? మునీంద్రా! సమస్తలోకులకుఁ గుశలమే ? మాను లెల్లరు సుఖ మున్నవారె ? దేవతలకు సేమమె ?

గాలవ—ఓ! అచ్యుతా! మాధవా! అనంతా! నాకుఁ దటస్థించిన పరాభవమును నే నేమని చెప్పఁజాలుదును? దానిని దలంచిన మాత్రమున హృదయము కంప మందుచున్నది.

సీ. బ్రహ్మాండ మెల్ల నీపావనాకారంబు
 ముమ్మూర్తులం దీవ ముఖ్యతముఁడ
వాదిమధ్యాంతంబు లందనివాఁడవు
 పతితపావనుఁడవు భద్రమూర్తి
వెల్లలోకములు నీయెఱుకకై వర్ధిల్లు
 గణుతింప నీ వెఱుంగనిది లేదు
లీలావిలాసలాలితమర్త్యమూర్తివి
 నవనీతచోర! కృష్ణా! మురారి!

గీ. ఆర్తిఁ గ్రుంగితిఁ గావవే యబ్జనాభ!
సంకటము దీర్పవే జలజాతనయన!
అభయ మిచ్చి కాపాడవే శుభచరిత్ర!
ప్రణతసంత్రాణశీల! గోపాలబాల!

కృష్ణుఁడు—స్వామి! తమకు నంతటియవమానము గావించినపాపి, యెవఁడై యుండును? తత్క్షణము చెప్పుఁడు. ఎవఁ డాయపరాధి? ఏమి సంభవించినది?

గాలవ—హా! కృష్ణా! దుష్టనిగ్రహశిష్టపరిపాలనమును జేయుటకు క్షీరాబ్ధిని వదలి నీవు ద్వారకయందు అవతరించి రాజ్యపరిపాలనము గావించుచున్నపుడుగూడ, నా తపమునకు భంగము సంభవింపవచ్చునా?

కృష్ణుఁడు—ఆహా! గాలవమునివరా! మీతపమును భంగపఱచిన వాఁడు ఇంకను జీవించి యున్నవాఁడె? ఆ దుష్కృత్యము ఎవరు గావించినది? చెప్పుఁడు. ఈక్షణము వానిని ఖండింతును.

గాలవ—ఓ యచ్యుతా! దేవసభయందు దివిజనాట్యాంగనలకు నాట్యము నేర్పునట్టిచిత్రసేనుఁ డను గంధర్వుఁడు ఊర్వశీగృహమునకు ఆకాశమార్గమున విమానమునందుఁ బోవుచు, నేను ఉషఃకాలమున యమునాతరంగిణిలోఁ బ్రభాకరునకు నర్ఘ్యప్రదానతత్పరుఁడనై యుండఁ, గొంచెమైనను దానిని బాటింపక ఆ పరమచండాలుఁడు తన పుక్కిటియం దున్న తాంబూలోచ్ఛిష్టమును నా దోసిలిలో నుమిసెను. ఓజనార్దనా! నీరాజ్యమునందు నా కీపరిభవము సంభవింపవచ్చునా?

కృష్ణుఁడు—బుద్ధిపూర్వకముగా అట్లు గావింప వాఁడు ధైర్యము చెందెనా?

[గానము వినును - నారదుఁడు ప్రవేశించును.]

గాలవ—ఇదిగో! నారదమునులు వచ్చుచున్నారు. ఈవిషయము వీరికిఁగూడఁ దెలియును.

కృష్ణుఁడు—నారదఋషిశ్రేష్ఠా! రమ్ము. కృతార్థుఁడ నైతిని. ఈ దినమే సుదినము. తపశ్శ్రేష్ఠులరగు మిమ్మిరువురను ఏకకాలమున సందర్శించుభాగ్యము కలిగినది. ఆసనము స్వీకరింపుము. [నారదుఁడు కూర్చుండును.] నారదమునిశ్రేష్ఠా! గాలవఋషికి సంభవించిన తపోభంగమును వింటివిగదా? ఇందులకు ఇప్పు డేమి చేయవచ్చును?

నారదుఁడు—వింటిని. [ఆలోచనతో] ఇందులకుఁ దగునట్టియోజన చేయువలయును.

గాలవ—భవభయహరధీరా! భక్తకష్టాపహారా!

క. ఆపదలం బాపి దీనులం, గాపాడుట నీ వ్రతంబు గా! కమలాక్షా!
ఆపాపి చెఱిచె నాతప, మే పడంపవె వాని, దీను నేలవె నన్నున్.

అనంతా! నా తపమును వ్యర్థము గావించిన ద్రోహిని హతము గావింపనియెడల నామనంబునకు సంతుష్టి కలుగదు.

నారదుండు—నిజము. అది మిగుల ఆవశ్యకము. ఐనను నా కొకసందేహము పొడముచున్నది. ఆచిత్రసేనుండు ఈకార్యము తెలిసి చేసెనా, లేక, తెలియక చేసెనా యనియే?

గాలవ—[ఆతురముతో] తెలియక యుండునా, ఆచండాలునికి!

కృష్ణుండు—నారదా! నీవు చెప్పినదియు నిజమే. ఐనను, ప్రాతఃకాలమునందు బ్రాహ్మణులును దాపసవరులును నదీతీరములకుం దపమాచరింప రాఁగల రని తెలిసియు ఉచ్ఛిష్టము నుమియ వచ్చునా? అందును సర్వజనులచే నుతింపంబడు యమునానదీ తీరముననే? ఇది యెటు లైనను దప్పిదమే కదా? ఇంతటి అధర్మము జరగవచ్చునా? ఇందులకు తగుదండన విధింపకున్న, నా రాజ్యధర్మమునకు లోపము గదా? గాలవఋషిశ్రేష్ఠా! చింతింపకుండు. రేపు సూర్యుండు అస్తమించులోపల, ఆ చిత్రసేనునిశిరస్సు మీపాదములకడ నిడువాఁడను.

గాలవ—సెబాస్! జనార్దనా! దీనరక్షకుం డన్న నీవే!

నారదుండు—సెబాస్! చక్కఁగా నుడివితిరి.

గాలవ—సరి, మేము ఇంక సెలవుపుచ్చుకొనెదము. కృష్ణా! రేపటి దినమున సూర్యుండు పశ్చిమాంబుధిలోనం గ్రుంకకముందే......

కృష్ణుండు—అట్లే! అట్లే!

గాలవ—

ఉ. నందకుమారకా! సకలనాయక! నీకరుణార్ద్ర దృష్టి పైఁ
జెందినవానికిం బడయఁ జెల్లని శ్రేయము లున్నవే? కృపా
మందిర! పోయివచ్చెదము మానెగు లింతటఁ దీఱుఁగాక! నీ
కుం దయివాఱుఁగాక యనుకూల సతీసుఖసంప్రమోదముల్!

నారదుఁడు—ఓముకుందా! నీవు ముక్తికి మూలాధారుఁడవు; మూల పురుషుఁడవు. నీవు చేయ నెంచినచో నేకార్యము నెఱవేఱకుండును? మేము పోయివచ్చెదము.—'దీర్ఘాయుష్మాన్ భవ'
[అని ఆశీర్వదించును.]

గాలవ—దీర్ఘాయుష్మాన్ భవ! [అని ఆశీర్వదించుచుఁ బోవును. తెర వ్రాలును.]

రంగము ముగిసెను.

# గాలవఋషినాటకము

లేక

# చిత్రసేనోపాఖ్యానము

---o---

## మూఁడవ అంకము - మొదటి రంగము.

---

[చిత్రసేనుని లతాకుటీరము - పగటికాలము.

సంధ్యావళియు రత్నావళియు వచ్చుచుందురు.]

సంధ్యావళి:—నాథుఁ డిచ్చటి కనుదినము వచ్చి కూర్చుండునా ?

రత్నావళి:—అవును. అనుదినమును ఈవేళకు తప్పక వచ్చి, ఆలతా గృహామునందుఁ గూర్చుండి ఊర్వశిపటమును జూచి చూచి, కన్నీరు విడుచుచుఁ గాలము గడపును. నిన్నటిదినముకూడ నేను జూచితిని.

సంధ్యావళి:—[యోజన నభినయించి] నా కొకయుక్తి తోఁచుచున్నది. నాథుఁడు నేఁడు వచ్చిన, అతనిరాక మనకుఁ దెలియనటులు, ఊర్వశిని దూషించుచు, మాటలాడుచుందము. అప్పటికైనను, అతనిపిచ్చి మాఱునేమో చూచెదము.

రత్నావళి:—అవు నవును. మంచియోజనయే! అదిగో చూడు. తిన్నగా నడచుచు వచ్చుచున్నాఁడు. మనము ముందు పోయి కూర్చుందము రమ్ము.

[చిత్రసేనుఁడు చింతాక్రాంతుఁడై లతాగృహమునందుఁ గూర్చుండి, ఊర్వశిపటమును ము న్నిడుకొని, చూపులు నిగుడ్చుచుండును.]

సంధ్యావళి:—రత్నావళీ! అటుపైని, ఊర్వశిసమాచారము వింటివా?

రత్నావళి:—ఏమి, ఏ మది అక్కా?

సంధ్యావళి:—మన ప్రాణనాథుఁడు, ఎప్పుడును ఊర్వశిపై పిచ్చిభ్రమ గొనియున్నాఁడే, ఆ ఊర్వశి యెట్టిదో తెలిసికొనుటకై, నిన్నటి దినమున, ఆమె యుండుస్థలమునకుఁ బోయి విచారింపఁగా...
[చిత్రసేనుఁడు చెవి యొగ్గి వినుచుండును.]

రత్నావళి:—ఊఁ! ఊఁ! ఆవల?

సంధ్యావళి:—అయ్యో! ఆసంగతి యేమని చెప్పుదును? వేశ్యలయం దైనను దారతమ్యములు లేవా? ఉత్తమలు, నధమలు లేరా? దేవలోకమునం దుండుపురుషు లందఱును ఆమెకుఁ బతులే!

రత్నావళి:—అయ్యో! అంతటిగుణహీనురాలిపైఁ బ్రేమగొని, యే వేళను దానినే స్మరించుచు, మన ప్రాణనాథుఁడు ఏటి కీలాగున వ్యసనము చెందుచున్నాఁడు?

సంధ్యావళి:—నాథుఁడు నిరంతరము దానికై పరితపించుచు సర్వమును మఱచియున్నాఁడు. ఆ ఊర్వశి యెల్లపుడును మర్త్యలోకవాసి యగు అర్జునుఁ డనునొకమానవునిపై మరులుచెంది వానిపటము ముందిడుకొని యెక్కుడుధారగా కన్నీరు నించుచున్నది. నిన్నటి దినముకూడ నేను జూచితిని.

రత్నావళి:—అయ్యో! మన ప్రాణనాథునికి ఇంత తెలివితక్కువగ నున్నదే! ఈమోసము నరయకుండెఁగా!

సంధ్యావళి:—అందులకు మన మేమి చేయఁగలము? మనము ఏదైనఁ జెప్పిన, ఆదాసిపై మన మసూయచే లేనిపోనికొండెములు

చెప్పచున్నా మని నాథుఁ డెంచుకొనును. ఏమియుఁ జెప్పక యుండుటయే యుత్తమము. ఈసామెత నెఱుఁగవా—"కుట్టిన తేలు గోడ కెక్కును; కూసినమ్మ రచ్చ కెక్కును"—అని.

రత్నావళి:—అయ్యో! వెదకి, వెదకి, దానికా, దేవేంద్రుఁ డిచ్చిన యంగుళీయకమును నాథుఁ డియ్యఁబోవుట?

సంధ్యావళి:—ఓహో! ఆకథను నీవు వినలేదే? చెప్పెదను వినుము. నిన్నటిదినము ఊర్వశికి ఆప్తురాలైన చెలికత్తె నొకతెను నేను బుజ్జగింపఁగ, దానిమర్మ మంతయు బయలుపడెను. ఊర్వశి అర్జునుని వశపఱచుటకై, మననాథుని మోసగించి, ఇంద్రునియొద్ద నుండి యీ అంగుళీయకమును గైకొనునట్లు చేసెనఁట! ఆమోసము నెఱుఁగక నాథుఁడు దానికి ఈయుంగరమును ఇయ్యనున్నాఁడు. కానిమ్ము. జరగున దంతయుఁ జూచుచుందము. రమ్ము.

చిత్రసేనుఁడు:—[తటాలున వారిముందఱ నిలువఁబడి] అట్లు గావించిననేను చిత్రసేనుఁడను గాను. 'ఇదియా విధానము!

సంధ్యావళి- రత్నావళి:—[తొట్రుపాటుతో] ప్రాణనాథా! ప్రాణనాథా! మీా రెప్పు డిచ్చటికి వచ్చితిరి? ఏమివర్తమానము?

చిత్రసేనుఁడు:—సంధ్యావళీ! నీవు చెప్పిన దంతయు సత్యము. ఆపాపి ఊర్వశిమోసము ఇప్పుడుగదా తెలిసినది!

మ. జగజంతల్ వెలకాంత నూర్వశి నికన్ స్వప్నంబునందైనఁ బొం
దు గణింపన్ దలపోయ, నిప్డు తెలిసెన్ దుస్తంత్ర మాయింతితోఁ
దగులాటంబునఁ గల్గుసంకటము లింతం జాలు, సాధ్వీమణుల్!
నెగులున్ వీడుఁడి! చూడుఁడీ! బెదరువానిన్ మీామనోవల్లభున్.

ఇఁకఁ బ్రాణ మున్నంతవఱకు, ఆపదుపుకత్తెను కలయందైనను స్మరింపను. ఇది సత్యము. ముమ్మాటికి సత్యము.

సంధ్యావళి:—ప్రాణనాథా! మీరు ఇచ్చట నుండినది—మేము—ఊర్వశినిగూర్చి మాటలాడినందులకు మన్నింపవలెను.

చిత్రసేనుఁడు:—మన్నించుటకు నేమి యున్నది? దానిని ఎంత దూషించినను దోషము లేదు. దానిమాట యిఁక నాతోఁ జెప్పకుఁడు. ప్రేయసీ! రత్నావళీ, కల్యాణీ! సంధ్యావళీ, నే నిదివఱకు ఎంతటిబుద్ధిహీనుఁడనై యుంటిని! అనలునిసాక్షిగ వివాహమాడినధర్మపత్నులు మీ రిరువు రుండ, కేవలము ఒకభోగకాంతపై మోహమును జెంది యుంటినే! సుందరాంగులారా! నన్ను మీరు క్షమింపవలయును. ఇఁక దానిని గలయంబైనను దలఁపను. [సంధ్యావళియు రత్నావళియు నొకరి నొకరు చూచుకొందురు.]

రత్నావళి:—ఇఁక, పోయినది పోనిండు. ప్రాణనాథా! అది అంతయు మఱచిపొండు. ఇప్పటి కన్నియు సరియయ్యెనుగదా. ఆయుంగరము నా కిండు.

సంధ్యావళి:—ఊఁ! నీ కిచ్చిన, మఱి నాకో?

చిత్రసేనుఁడు:—నామాట వినుఁడు. నెల కొకరు దీనిని ధరించుచుండుఁడు.

సంధ్యావళి:—అట్లే కానిండు. అయిన మొదట ఈనెలలో నా కిండు.

రత్నావళి:—మొదట నాకే కావలెను.

సంధ్యావళి:—ఏమే! నేనే కదా పెద్దదానను.? కాన నాకు మొదట ఇయ్యవలదా?

రత్నావళి:—నేను చిన్నదానను గాన, నాకే మొదట ఇయ్యవలెను.

[లోపలనుండి, నారదుఁడు, "చిత్రసేనా, చిత్రసేనా" యని పిలుచును.]

చిత్రసేనుఁడు:—ఆహా! ఎవ రది? నారదమునికంఠస్వరముగానున్నది!

సంధ్యావళి:—అవు నవును.

రత్నావళి:—ఇదిగో వచ్చుచున్నారు!

[నారదుఁడు ప్రవేశించును. అందఱును సగౌరవముగ నెదుర్కొని పిలుచుకొని వత్తురు.]

అందఱును:—స్వామి! నమస్కారము. [అని నమస్కరింతురు.]

చిత్రసేనుఁడు:—మునిపుంగవా! మీరాకవలన ధన్యుఁడ నైతిని. ఏమివిశేషము?

నారదుఁడు:—చిత్రసేనా! నాఁడు దేవసభయందు "స్త్రీలమాట వినవల" దని చెప్పిన, నామాట వినకపోయితివిగదా? ఇప్పుడెంతటిముప్పు సంభవించెనో చూచితివా?

అందఱు:—ఏమి? ఏమి?

నారదుఁడు:—వే ఱేమి? నీవు ఊర్వశియింటికి అంబరవీథి నేఁగుచు, నుమిసినతాంబూలోచ్ఛిష్టము యమునానదియందు అర్ఘ్యము విడుచుచున్న గాలవమహర్షి దోసిటఁ బడెను. అతఁడు కుపితుఁడై శ్రీకృష్ణభగవానునియొద్దకుఁ బోయి మొఱ నిడ—

సంధ్యావళి-రత్నావళి:—ఆ! ఆ!

నారదుఁడు:—వాసుదేవుఁడు దానిని చెవియిచ్చి విని, కినిసి, రేపటి సాయంకాలములోఁగా ప్రతిక్రియ చేయునట్లు ప్రతిన చేసియున్నాఁడు.

చిత్రసేనుఁడు:—అయ్యో! ఇందులకు నే నేమి చేయుదును?

నారదుఁడు:—మడియుటకు సిద్ధముగా నుండవలసిన దే!

రత్నావళి:—హా! [అని మూర్ఛిల్లును. చిత్రసేనుఁడు పరితపించును.]

సంధ్యావళి:—[నారదునిపాదములఁ బడి నమస్కరించుచు]

శా.స్వామీ ! నామది తల్లడిల్లెడు నయో.! సర్వజ్ఞుఁ డౌ కృష్ణుఁ డి ట్లే మీపంతము పూనె ? నావిభుఁడు దా నీతప్పిదం బజ్ఞతా [గదా వ్యామోహంబునఁ జేసె నం చెఱుఁగఁడే యన్యాయ్య మయ్యెం నామాంగళ్యము మీరె కావవలయున్ బ్రార్థింతు నత్యార్తనై !

స్వామి ! ఎంతటి పిడుగువంటివార్త ! నా ప్రాణనాథుని ప్రాణమును గాపాడవలెను. అయ్యో ! అతఁడు తెలియక చేసినతప్పుకై, శ్రీకృష్ణ భగవానుఁడు ఇట్లు దండింపఁదగునా ? అయ్యో ! అయ్యో ! [అని యేడ్చును.]

చిత్రసేనుఁడు:—[దీనముఖముతో] మునివరా ! నేను నిరపరాధిని. నేను గాలవఋషినిగాని, అతఁడు అర్ఘ్యము విడుచుటనుగాని చూచియెఱుఁగను. అట్లుండ, నేను దెలియక చేసినకార్యమునకై దండించుట న్యాయమా ?

నారదుఁడు:—చిత్రసేనా ! గతజలసేతుబంధన మెందులకు ? ఇందులకు చింతించిన నేమిప్రయోజనము ? నీప్రాణమును గాపాడు కొనుమార్గము నరయుము.

చిత్రసేనుఁడు:—స్వామి ! తామే నాకు దిక్కు. మీరే నన్నుఁ గాపాడవలయును.

సంధ్యావళి:—స్వామి! స్వామి! మీరు తప్ప మాకు వేఱుదిక్కు లేదు. మీరే మా ప్రాణనాథునిఁ గాపాడి మాసౌమాంగల్యమును రక్షింపవలయును. మాకుఁ బతిభిక్ష నొసంగవలయును.

[చిత్రసేనుఁడును సంధ్యావళియు సభ్రములై నమస్కరింతురు.]

నారదుఁడు:—చిత్రసేన ! సంధ్యావళీ ! లెండు. నేను చేయఁదగిన సాహాయ్యము చేసెదను. అయినను ఇది మిగులఁ గష్టతరము. అచ్యుతునియాజ్ఞ కెవ రడ్డుపడఁగలరు ? అయినను ఒకయుక్తి తోఁచుచున్నది. అర్జునుని స్వాధీనపఱచుకొనిన, కార్యము

సాఫల్య మందును. అందులకై సుభద్రను వశపఱచుకొనవలెను. మీరు ముప్వురును భూలోకమున కేఁగి, తత్క్షణము సుభద్రాంతఃపురోద్యానవనసమీపప్రాంతమునం దొకచోట అగ్నిప్రజ్వాలనము గావించి, అగ్నిప్రవేశము చేయఁబోవునటులు సాహసనటనము చేయుఁడు. ఆస్థలమునకు సుభద్ర వచ్చునట్లు నేఁగావించెదను. సంధ్యావళీ! నీవు ఆమెయొద్ద వేఱొండుమాట నుడువక మాంగల్యదానమునే వేఁడుము. ఆమె యావర మిచ్చినపిమ్మట, సత్యము తెలుపుము. పిదప జరగవలసినకార్యములను నేను చూచుకొనియెదను. ఈక్షణమున బయలుదేఱుఁడు. నేను నాకార్యముల నారయఁ బోవలయును.

[అంపఱు నిష్క్రమింతురు.]

రంగము ముగిసినది.

---

# గాలవఋషి నాటకము

లేక

# చిత్రసేనోపాఖ్యానము

—:o:—

## మూఁడవ అంకము — రెండవ రంగము.

[ఉద్యానవనము—సాయంసమయము.

సుభద్ర యుద్యానవనమున విహార మొనర్చుచుండును.]

సుభద్ర:—ఆహా! నే నేమని చెప్పుదును? నానాథుఁడు నాపై నెంతటి ప్రీతిఁ గలవాఁ డైనను లోకమునఁ బురుషుల మాత్ర మెన్నఁటికిని నమ్మఁదగదు.

తే. ఒకటి చెప్పుదు రవల నింకొకటి చేయు
దురు దురుద్దేశ్యములు లోన దుముకొనుచును
దియ్యగాఁ బల్కుదురు వారి నెయ్య మరయఁ
దేనె పూసినకత్తిమాదిరియె చూవె!

అటనిమున మైనను నన్నెడఁబాయఁజాలనినామనోవల్లభుఁడే యీరీతినొనరించిన, మిగిలినవారినిగుఱించి నుడువ నేల? మీఁదుమిక్కిలి గృహస్థాశ్రమము నవలంబించినపురుషులు స్త్రీలయొద్ద కొన్నిసందర్భములందుఁ గల్లలాడవచ్చుననికూడఁ బుస్తకములయందు వ్రాయఁబడి యున్నవఁట. ఇందులకు నెవరిని దూషింపవలెను? ఎరినైన నేల? వ్రాసినవారు అజ్ఞానమున వ్రాసినను, జేయువారికైనను మనసు కరఁగ దాయెనుగా! ఒకదినమా, రెండుదినములా? నేఁటికి మూఁడు దినములు గావచ్చెను! నాథుఁడు మఱునాఁడేవచ్చెద నని చెప్పిన

తోఁడనే, నాకు సందియము తోఁచెను. ఐనను, ఎదుట నిలిచి, బలి మాలి, ప్రియోక్తులాడ నెటు లొల్లకుందును? నాయవివేకము. నేమన వలెను? స్త్రీలకు ముందుయోజన లేదన్నమాట వాస్తవము. లేనిచో, ఇప్పుడు తోఁచెడువిషయములు అప్పుడేల తోఁపకపోయెను? ఇస్సిరో! ఎంత పొరపడితిని! ఇఁకనైనను జాగ్రత్తగా నుండవలెను. [యోజన నభినయించి] అది యుండనిమ్ము—ఇప్పు డేమి చేయుదును? వేఁట యందలియుత్సాహామువలనఁ బ్రాణనాథునకు నింటిమీఁదిజ్ఞప్తి యిసు మంతయు లేదుకాఁబోలు! లేక—మఱి యేకార్యమునైనను బూని యున్నారేమో? తీర్థయాత్రకు బయలుదేఱి నన్ను వివాహ మాడి వచ్చినవారు, వేఁటకు బయలుదేఱి మఱెవరినైనఁ జేపట్టి రాఁజాలరా? అటులు చేయుటచేఁ గులమర్యాదలకుఁగూడ భంగము కలుగదు. అందు లోను సహవాసదోషము. ఎప్పుడైనను నేను దీనినిగుఱించి ప్రశ్నిం చిన, మీయన్నచర్యలు నిట్టి వని చెప్పుచుందురు. నే నే మనఁగలను? ఇట్లు గుందుట నావిధి. పేరునకుమాత్రము గాండీవి సుభద్ర నరనిమున మైనను విడిచియుండఁ డని లోకు లనుకొందురు. అయ్యో! జగదీశ్వరా! ఇది నాపాపమా! నాసవతుల కందఱకును దీనివలన నాపై నసూయ. నిన్నటిదిన మొకతె—అక్కా! యెల్లప్పుడును బ్రాణనాథుని నీయొద్దనే యుంచుకొందువా యని పలికెను! ఇంకొకతె, నీయొద్ద నేమిమహిమ యున్నది? నాకు కొంచెము చెప్పలేవా? యని యడిగెను. సమస్తము నెఱింగినపాంచాలియు, ఎవరైనను బ్రాణనాథుని వెదకుచు వచ్చిన, సుభద్ర నడుగుఁ డని చెప్పిపంపును. ఈవైపరీత్యమున కేమి చేయుదును?

[సేవకుఁడు ప్రవేశించును]

సుభద్ర:—ఎవ రక్కడ?

సేవకుఁడు:—అమ్మా! వందనములు. ద్వారకనుండి వచ్చినదూతను.

సుభద్ర:—[ఆతురముతో] ఆ! నీవా! ఏమివార్త? మా అన్న మొదలగువారు క్షేమముగ నున్నారా?

సేవకుఁడు:—అమ్మా! అందఱు క్షేమమే.

సుభద్ర:—నీవు వచ్చినకార్య మెద్ది?

సేవకుఁడు:—కృష్ణపరమాత్ముఁడు, అర్జునరాజును పిలుచుకొని రమ్మని పంప, వచ్చితిని. ఇచ్చటికి వచ్చి, ధర్మరాజు నడుగ, వారు మిమ్ము నడుగు మని చెప్పిరి.

సుభద్ర:—[విసుగుతో] ఆయనవంతుకూడ తీరినది! సరి. అర్జునరాజు మూఁడుదినములుగా నిచటికి రాలే దనియు, వేఁటకుఁ బోయిన వా రిదివఱకు ఇంటికి రాలే దనియుఁ జెప్పుము.

సేవకుఁడు:—అమ్మా! అట్లే చెప్పెదను. [వెడలును.]

సుభద్ర:—నా బ్రదుకు ఈలాగున నున్నది. శ్వేతవాహనుఁడు కానరాక పోయిన, సుభద్ర నడుగు మందురు! లోకులంద ఱిట్లు తలఁచుచుండ, సుభద్రగతియో దైవ మెఱుఁగును. ప్రాణనాథుఁ డిడినగడువు తప్పి, రాకపోయినను, లోకులుమాత్రము నా కిట్టి యున్నతపదవి నొసంగియున్నారు. అంతే చాలును. నే నెంత చింతిల్లిన నేమిఫలము? నాథునికి మనసు కరఁగినచో రానే వచ్చును.

[మఱియొక సేవకుఁడు ప్రవేశించును.]

సేవకుఁడు:—అమ్మా! అర్జునరాజు వచ్చినారా యని కుంతీదేవిగారు విచారించి ర మ్మన్నారు.

సుభద్ర:—ఎవరు? కుంతీదేవియా? హా! వారియందు దోషము లేదు—ఇంకను రా లేదని చెప్పుము—పో.

సేవకుఁడు:—చిత్తము.

సుభద్ర:—ఆహా! ఇ దేమి చోద్యము! ప్రాణనాథుఁడు రాలేదని నేను బరితపించుచుండ, పుండుపై పుల్లతో పొడిచినట్లు, ప్రాణనాథుని

వెదకువా రందఱుఁగూడ నన్నే యడుగ వచ్చెదరు! [మఱి యొక సేవకుఁడు వెదకుచు వచ్చును.]

సుభద్ర:—ఇదిగో మఱియొక సేవకుఁడు వచ్చుచున్నాఁడు!—[వానివంకఁ దిరిగి] అర్జునరాజును వెదకుచు వచ్చితివా?

మూఁడవ సేవకుఁడు:—అవును దేవీ! పాంచాలీదేవిగారు మిమ్ము విచారించి రమ్మన్నారు.

సుభద్ర:—ఈశ్వరా! ఈశ్వరా!—లేదని చెప్పుము. పొమ్ము.

సేవకుఁడు:—చిత్తము.

సుభద్ర:—ఇందులకు నే నేమి చేయఁగలను? ఇం దుండిన, ఒకరి వెంబడి నొకరు వచ్చుచునేయుందురు. కాన, నే లతాగృహమునకు పోయి యందుఁ గూర్చుండెదను. అచ్చటకు ఎవరును వచ్చి నన్ను బాధింపరు. [అని లతాగృహమునకుఁ బోవును. అచ్చట మఱియొక సేవకుఁడు కనఁబడును.]

సేవకుఁడు:—దేవీ! నమస్కారము.

సుభద్ర:—ఏమిరా! అర్జునరాజును వెదకుచు వచ్చితివో? అతనిని గుఱించి నన్నడుగవలదని నిన్న నే ఆజ్ఞనిడితినే. ఇపుడు నీ విచటి కేల వచ్చితివి?

సేవకుఁడు:—అమ్మా! మిమ్మును అడుగ రాలేదు.

సుభద్ర:—ఐన నెందులకు వచ్చితివి?

సేవకుఁడు:—స్వయముగా చూచిపోద మని వచ్చితిని.

సుభద్ర:—[కోపముతో] పొమ్ము. నాయెదుట నిలువకుము. నాయాజ్ఞ లేనిది యీలతాగృహమునకు రాకుము.

సేవకుఁడు:—అట్లే. [వెడలును.]

సుభద్ర:—ఈశ్వరా! సర్వేశ్వరా! నేను నవ్వవలయునో, ఏడ్వవలయునో నాకే తెలియరాకున్నయది. ఇఁక నైనను ఎవరును

రాకుందురుగాక! అబ్బా! యిచ్చటఁ గొంచెము కూర్చుండి విశ్రమించెదను. [కూర్చుండును] హా! వసంతకాలము ప్రారంభమైనదిగా! ఇట్టితరుణమునఁ గాంతుఁడు నను వదలి పోనగునా!

మ. చివురుంజొంపము లెత్తెఁ, గ్రొత్తగ లతల్ చిల్కెల్ బళా! కిల్కిలా
రవముల్ సల్పెడుఁ గోకిలల్ మదనసామ్రాజ్యోత్సవాలోకవై
భవముల్ దెల్పెడు, నెల్లలోకమును దీవ్యద్భోగమై పొల్చె, ని
ట్టివసంతంబున నన్నుఁ బ్రాణసఖ వీడెఁ వల్లభుం డయ్యయో!

[నారదుఁడు గానము చేయుచు వచ్చుచుండును.]

సుభద్ర:—ఆ! ఎవ రది? గానము వినవచ్చుచున్నది!

నారదుఁడు:—నేను నారదుఁడ. రావచ్చునా?

సుభద్ర:—[ఎదురేఁగి మోఁకరించి] స్వామి! నమస్కారము! విచ్చేయవలయును. ఈయాసనము నలంకరింపుఁడు. [నారదుఁడు కూర్చుండును.]

నారదుఁడు:—దీర్ఘసుమంగలీ భవ! [అని యాశీర్వదించును.]

సుభద్ర:—స్వామి! కడుదూరము విచ్చేసి నాగృహమును బావనము చేసితిరి. మీసేవ యొనర్చుభాగ్యము చేకూఱుటకు నేదో విశేషముండవలయును?

నారదుఁడు:—నేను వచ్చిన నేదో విశేష ముండవలయు నని సిద్ధాంతమా?

సుభద్ర:—అవును. మీరాక యే నాకు విశేషముగదా? మునిశ్రేష్ఠుల రగుమీరు నాగృహమునకు వచ్చుటే నాపూజాఫలవిశేషము.

నారదుఁడు:—సంతోషము. సుభద్రా—అర్జునుఁడు సుఖియై యున్నవాఁడే?

సుభద్ర:—స్వామి! భవత్కృపావిశేషంబున క్షేమమే. ఐన, నందుల గుఱించి తాము న న్నడిగెదరా?

నారదుఁడు:—వేఱెవరి నడుగవలయు ? అర్జునునివర్తమానమునుగూర్చి సుభద్రనడుగవలయు ననియే, అందఱును జెప్పెదరు. అందుఁ దప్పేమున్నది? నిజమేకదా! అర్జునుఁడు నిన్నొడఁబొఁయక మెలంగుట నాకును మిగులసంతోషమే. ఇఁక ప్రతిజన్మమునందును నీవు ఫల్గునునే భర్తగాఁ బడసి సుఖముగా మెలంగుదువుగాక !

సుభద్ర:—స్వామి ! అన్నియు మీయాశీర్వాదములు.

నారదుఁడు:—నాయాశీర్వాద మని చెప్పకుము. ఇది సాధారణముగా లభింపఁదగినఫలము గాదు. పూర్వజన్మసుకృతఫల మని యెంచుము. దామోదరుని చెలియలు, గాండీవిప్రియురాలు, అభిమన్యునితల్లి యని నీవు పడసినఖ్యాతి యీలోకమునందు ఎవరు పొందఁగలరు ? ఆయుష్కాల మంతయు గౌరీవ్రత మనుష్ఠించినవారికే ఆఫలము లభించును.

సుభద్ర:—[ఆతురముతో] మునిపుంగవా ! అ దేమివ్రతము ? దాని విధానముం దెలియఁజేయుఁడు ?

నారదుఁడు:—అదియా ! చెప్పెద వినుము.

తరల. శుభదినంబున వేకువన్ బరిశుద్ధ మాపువుఁదోఁటలో
నభిమతుల్ చెలువొందఁగా, బహుళార్థపూర్తిగ శాస్త్రమం
దభిహితం బగునట్లు గౌరికి నర్చ లిచ్చి ద్విజాళులన్
విభవ మొప్పఁగఁ దన్పఁగా, నిది వేడ్క లిచ్చువ్రతం బగున్.

సుభద్ర:—స్వామి ! నే నీవ్రతమును రేపటియుదయముననే సల్పుటకుత్తరువు నను గ్రహింపవలయును.

నారదుఁడు:—సుభద్రా! నీ కేటి కీవ్రతము? ఈవ్రతమువలన ఇతరులు పొందఁగోరుఫలమును నీ విదివఱకే పొందియున్నావు. నీ కెందులకు లేనిపోని శ్రమ ?

సుభద్ర:—అట్లు గాదు స్వామి! ఏజన్మమునందును విజయుఁడె నాకుఁ బ్రాణనాథుఁ డగునట్లు నే నావ్రతమును సల్పి వరము పొంద వలయును. ఈజన్మమునందుఁగూడ నాథుఁడు, నన్ను వదలి యుండకుండునటులు గావింపవలయును.

నారదుఁడు:—అ దేమి అట్లు చెప్పెదవు? నిన్నేలాగున విడిచియుండఁ గలఁడు? నాశిష్యునిఁ బరిహాసము చేయుచున్నావుగాఁబోలు?

సుభద్ర:—అవునవును. మీశిష్యునినడతలు మీ కేమి తెలియును? రేపే వచ్చెద నని చెప్పి పోయి నేఁటికి మూఁడు యుగములు కావచ్చెను!

నారదుఁడు:—ఎవరు అర్జునుఁడా?

సుభద్ర:—అవును.

నారదుఁడు:—ఎచ్చటికిఁ బోయెను?

సుభద్ర:—వేఁటాడుట కని చెప్పి పోయిరి. ఆవల మఱెచ్చటికిఁ బోయిరో తమకే తెలియవలెను.

నారదుఁడు:—ఎన్నఁడు పోయెను?

సుభద్ర:—నేఁటికి మూఁడుదినముల క్రిందట.

నారదుఁడు:—మూఁడుయుగము లాయె నని చెప్పితివే ముందు!

సుభద్ర:—నాథుఁడు విడిచిపోయినపిదప ఒక్కొకగడియ, ఒక్కొక యుగముగాఁ గడపుచున్నాను. మూఁడుయుగము లని చెప్పినది పొరపాటు. ఇంకను హెచ్చుయుగము లనియే చెప్పఁదగును. స్వామి! తమరే న్యాయము తీర్పవలయును. ఈరీతిగా నాథుఁడు ఆడినమాట తప్పవచ్చునా? నన్ను ఒంటరిగా వదలి పోవచ్చునా?

నారదుఁడు:—సుభద్రా! కోపింపకుము. వేఁటాడుటకుఁ బోయినపుడు కొంచె మాలస్య మైనను గావచ్చును. అది సహజమే కదా?

ఇందులకై కుందవచ్చునా? శీఘ్రముగనే, నీనాథుఁడు మరలి క్షేమముగా రాఁగలఁడు. వెతలఁ జెందకుము. నేను బోయి వచ్చెదను. ఎందుకైనను నీవు ఆవ్రతమును అనుష్ఠించుటయే యుత్తమ మని తోఁచుచున్నది.

సుభద్ర:—స్వామి! తత్క్షణమే వ్రత మాచరించెదను.

నారదుఁడు:—అంతటియవసర మేమి? ఐనను నీయిష్టానుసారమే చేయుము. వ్రతము చేయనెంచిన, పట్టణమునకుఁ గొంతదూర ముగా నేఁగి పూజ సలిపిన మంచిది. ఇచ్చటికి సమీపమున నొనరించిన, కోరెడువారికోర్కు లెల్ల నీవలసివచ్చును. దూర ముగాఁ బోయి వ్రతము గావించిన, యాచకులు పెక్కండ్రు రా కుందురు. కార్యము సులభముగా ముగియును.

సుభద్ర—స్వామి! అదేమి అట్లు సెల విచ్చెదరు? కోరునంతధన మిచ్చుటకు నాకు శక్తి లేదా?

నారదుఁడు:—అది గాదు. నీభర్త యిచ్చట లేనప్పు డడిగిన, వాని నన్నింటి నిచ్చుట కష్టతరముగా నుండునేమో యని తలంచి చెప్పితిని గాని మఱేమియుఁ గాదు. పిదప నీయిష్టము.

సుభద్ర:—స్వామి! మీరుగూడ నచ్చటికి విచ్చేయవలయును.

నారదుఁడు:—అందుల కేమి? అట్లే వచ్చెదను. నేను పోయివచ్చెదను.

సుభద్ర:—అట్లే, స్వామి! నమస్కారము. తప్పక రావలయును.

నారదుఁడు:—తప్పక వచ్చెదను. [దీర్ఘసుమంగలీ భవ—అని ఆశీర్వదించి గానముచేయుచుఁ బోవును.]

రంగము ముగిసినది.

# గాలవఋషి నాటకము

లేక

# చిత్రసేనోపాఖ్యానము

మూఁడవ అంకము — మూఁడవ రంగము.

---

[ఉపవనప్రాంతము. ప్రాతఃకాలము. చిత్రసేనుఁడును సంధ్యావళియు రత్నావళియు నొకవైపునఁ జేరి రగిలించు చుందురు.]

చిత్రసేనుఁడు—ఆహా! సుందరాంగులారా! నేను మహాపాపిని. నాకొఱకై యేల మీరు వగలఁ జెందెదరు?

సీ. అక్కటక్కట సాధ్వులార! నాకై యేల
పరితపించెద రీదేపాపఫలము
అనుభవింపక తీఱునా? నాకు నేఁటితోఁ
దీఱెఁగావలయు నందేహ మేల?
పరమాత్మునకుఁ బగవాఁడనై తద్బాణ
జాలమ్ముచేఁ దుదకేల చావ?
ఈయగ్నికుండమం దేనుగా దుమికి, యీ
ప్రాణమ్ము లిత్తుఁ బాయువాఁడ

గీ. వగలఁ బొగులంగ నేటి కోవనితలార!
కాలగతి దప్ప దో ప్రాణకాంతలార!
పరసుఖము గల్గఁగాఁ బరాత్పరుని వేఁడి
మేలు నా కొనగూర్పుఁ డో మెలఁతలార!

రత్నావళి:—నాథా! నేనుగూడ మీతో అగ్నిప్రవేశము గావించె దను. [అని ప్రలాపించును.]

సంధ్యావళి:—నాథా! కొంచెము శాంతింపుము. సుభద్రాదేవి వచ్చు వేళ గావచ్చినది. నారదఋషి చెప్పినరీతిని, ఆమెను ఆశ్రయిం చినఁ, గార్యసిద్ధి తప్పక కలుగఁగలదు. ఉదయమున శుభశకున మొకటి గలిగినదికదా! అది వ్యర్థము కానేరదు.

చిత్రసేనుఁడు:—ఎవరిని ఆశ్రయించినను, అచ్యుతునికి అడ్డము నిలు వఁగలరా?

సంధ్యావళి:—ప్రాణనాథా!

క. గాండీవిశరమునకు నా
ఖండలుకులిశంబు నదరఁ గల దన విననే
యొం డేమి కృష్ణదేవుని
గుండియ చెదరంగఁ జేయఁ గూడుట యరుదే?

అదిగో సుభద్రాదేవి నారదఋషితో సమీపమున నే వచ్చు చుండునట్లు గాన్పించుచున్నది. [యోజన నభినయించి] రత్నా వళీ, నీవు వ్యసనాక్రాంతవై మైమఱచిన ట్లుండుము. ఏమియు మాట లాడకుము. ప్రాణనాథా! మీరు అగ్నికుండమునందు నుఱుకునట్లు నటించుచుండుఁడు. నేను ఎలుఁగెత్తి యేడ్చుచుండెదను. జాగ్రత్త. [అని సంధ్యావళి పెద్దగొంతుతో] అయ్యో! ప్రాణనాథా! వలదు, వలదు. నాముఖసందర్శనమున నైనను గొంచెము కనికరము వహింపఁగూ డదా? అయ్యో! అయ్యో! ఇచ్చట నామొఱ నాలకించువా రెవరు లేరా?

చిత్రసేనుఁడు:—వృథగా నన్నేల యడ్డుపెట్టెదవు? విడువుము.

సంధ్యావళి:—అయ్యో! ప్రాణనాథా! [అని యేడ్చును. ఒకప్రక్క నుండి నారదుఁడును సుభద్రయును సంభాషించుచు వత్తురు.]

సుభద్ర:—స్వామి! నన్ను మన్నింపవలయును. వారివృత్తాంతము నారసి క్షణములో మరల వచ్చెదను.

నారదుఁడు:—సుభద్రా! ఇదేమి వైపరీత్యము! గౌరీపూజ గావించి నీవు గృహమునకు మరలక, లేనికార్యము లేవో కావించుచున్నా వేమి?

సుభద్ర:—స్వామి! అటులు గాదు. ఎవరివో దీనాలాపములు వినఁబడుచున్నవి. అందును స్త్రీకంఠముగా నున్నది. అగ్గిమంట గూడఁ గాన్పించుచున్నది. స్వామి! స్త్రీస్వభావసహజ మగు కరుణాభావముచే, నాచిత్తము తహతహపడుచున్నది. నేను బోయి సంగతి నారసి వచ్చెదను.

నారదుఁడు:—సుభద్రా! ఏటిమాటలు? అం దేఁగిన నేమియాపద రాఁగలదో? ఎట్టివైపరీత్యము గలుగఁబోయెడినో? వారిగొడవలలో మనము తల దూర్చుకో నేల? వలదు. రమ్ము, పోవుదము.

సుభద్ర:—స్వామి! నన్ను నిరోధింపక, నాకు సెలవొసంగుఁడు. నే నొక్కతెనే పోయి వచ్చెదను. మీ రిచ్చటనే యుండుఁడు. వేయినోములు నోఁచుటకంటె వెతలఁ జెందునొక ప్రాణికి నుపకారము చేయుట మిక్కిలి శ్రేష్ఠ మని నా అన్న నాకుఁ బలుమాఱు బోధించియున్నారు.

నారదుఁడు:—సరి. అట్లయిన నీయిష్టము. నాకు తోఁచినది చెప్పితిని. పిదప నేదైనఁ గష్టము సంభవించిన, నన్ను నిందింపకుము.

సుభద్ర:—అటు లేల సంభవించును? ఏమియుఁ గలుగదు.

నారదుఁడు:—నీయిష్టము. సుఖముగాఁ బోయి రమ్ము. నే నిచ్చటనే యుండెదను. శీఘ్రముగ మరలిరమ్ము.

[సంధ్యావళి మొదలగువా రుండుచోటికి సుభద్రపోవును. సంధ్యావళి యేడ్చుచుండును.]

సుభద్ర:—అమ్మా! నీ వెవరు? ఇచ్చట నేల అగ్ని ప్రజ్వలింపఁ జేసి, యిటు లేడ్చెదవు? నీదాపున నుండువా రెవరు?

సంధ్యావళి:—అమ్మా! నీ వెవరో యుత్తమస్త్రీవలె కనఁబడుచున్నావు. మహాపాతకు లైనమావృత్తాంత మేల యడిగెదవు? దానిని వినినఁగూడ పాపము సంభవించును.

క. అగచాట్లం గుడుచుటకై
జగమందుఁ జన్మమందుఁ జానలలో నే
ను గణింప మొదటిదానను
పొగిలెదున న్నేల కెలికి పొడిచెద వమ్మా!

అమ్మా! నీకార్యము చూచుకొని నీదారిని బొమ్ము.

సుభద్ర:—అటులు ద్రుణీకరింపకుము. నీకుఁ గలిగినకష్ట మేమో నాతోఁ గొంచెము చెప్పుము.

సంధ్యావళి:—అమ్మా! నీతోఁ జెప్పిన నేమిలాభము? నీవు వినిన, సంతాపముఁ జెందుదువు గానఁ జెప్పకుండుటయే యుత్తమము.

సుభద్ర:—నీవు తప్పుఁ దలఁచితివి. నావలనఁ గాఁగలిగినసహాయము చేసెదను. చెప్పుము:

సంధ్యావళి:—నీవలన నేమి కాఁగలదు? శ్వేతవాహనునిధర్మపత్ని యైన సుభద్రవలననైన, నిది నెఱవేఱుట కష్టసాధ్యమై యుండ, నీ వేమి చేయఁగలవు?

సుభద్ర:—అమ్మా! నేనే సుభద్రను. నావలనఁగూడ నసాధ్య మైన కార్య మెద్ది? ఎటులైనను నాతోఁ జెప్పుము.

సంధ్యావళి:—[మోఁకరించి, సుభద్రపాదములపైఁ బడి] దేవీ! దేవీ! మీవలన కానిది యే దైనఁ గలదా?

శా. తోడం బుట్టితి వెల్లలోకములకుం దో డైనయాశౌరికిన్
గ్రీడిన్ గాండివిఁ బెండ్లియాడితివి, భ ర్తృభ్రాతృసంప త్తినీ
కీ డేరీ ! ధరణీతలంబునను దేవీ ! వహ్నిసంజాతవీ
వీడంబోవ కనుగ్రహించితివ యే నేదేని కాకుండునే?
అమ్మా ! నీనోటార నేఁ గోరునది యిచ్చెద నని ఒకమాట చెప్పు
ము. నా ప్రాణము నీయధీనమున నున్నది.

సుభద్ర:—అట్లే కానిమ్ము. ఏమి నీవు కోరునది ?

సంధ్యావళి:—అమ్మా ! ఆమాట యొకటే చాలును. నామనో
వాంఛ యీడేరినది. నాకు మాంగల్యదానము నియ్యవలెను.
ఇతఁడు నాజీవితేశ్వరుఁడు. నేఁడు మృతిఁ జెందుటకు సిద్ధమగు
చున్నాఁడు. నానాథునకు ప్రాణదాన మొసంగి, నామాంగల్య
మును గాపాడవలయును. అదిగో నా సపత్ని మూర్ఛ చెంది
యున్నది. దాని మాంగల్యమును గాపాడుదురుగాక. ఇదియే
నేఁ గోరునది.

సుభద్ర:—అతఁ డేటికిఁ జావ సిద్ధపడుచున్నాఁడు ?

చిత్రసేనుఁడు:—[ముందునకుఁ బోయి] అమ్మా ! నన్ను క్షమింప
వలయును. నిరపరాధి నైననన్ను నొకరు, నేఁటిసాయంసమయ
ములోన నెట్టులైనను వధించునట్లు, ప్రతిన పూనియున్నారు.
కాన, పరులచే మృతిఁ జెందుటకన్న, స్వయముగా నా ప్రాణ
ముల వీడఁ దలఁచితిని. నా ప్రయత్నమును నిరోధింపకుము.
నీ కెందులకు ఈకష్టము ? అబల నైననీవలన నేమి కాఁగలదు?

సుభద్ర:—అటు లనవలదు. నావలనఁ గాకయుండినను, నా ప్రాణనా
థునితోఁ జెప్పి, మీ ప్రాణమును గాపాడెదను. వెతఁ జెంద
కుము. ఆతురపడి యసువుల వీడకుము.

చిత్రసేనుఁడు:—అమ్మా ! మీమాట విశ్వసింపవచ్చునా ?

సుభద్ర:—నిస్సందేహముగా.

చిత్రసేనుఁడు:—దేవీ ! నేను ధన్యుఁడ నైతిని. నా ప్రాణములు దక్కినవి. ఇఁక నావృత్తాంతమును జెప్పెదను. సావధానముగ వినఁ గోరెదను. నేను గంధర్వుఁడను. చిత్రసేనుఁ డనువాఁడను. యమునానదిమీఁదుగాఁ బవనమార్గమునఁ బోవుచుంటి, భూలోకమం దచటఁ గ్రింద నేమి జరుగుచున్నదియుఁ జూడక తాంబూలోచ్ఛిష్టము నుమిసితిని. ఆకస్మికముగా నాకర్మవశమున నచ్చట నర్ఘ్యము విడుచుచుండినమహాపూజ్యుఁ డైన గాలవ ఋషిదోసిటియందు ఆయుచ్ఛిష్టము పడెను. నేను దెలియక చేసినతప్పిద మని యెఱుఁగక, ఆముని శ్రేష్ఠుడు కుపితుఁ డై, ఆరాజ్యము నేలురాజునొద్ద మొఱనిడ నేఁడు సూర్యుఁడు అస్తమించులోపల నన్ను వధించునటులు ఆప్రభువు ప్రతిజ్ఞ గావించి యున్నాఁడు. అద్దానిని వారించుటకు నాకు తరము గాదు. కాన, అట్లు ప్రాణములు కోల్పోవుటకన్న నిప్పుడే నసువుల వీడ సంసిద్ధుఁడ నై యుంటిని. నాపూర్వసుకృతమువలన మీరు వచ్చి యభయ మొసంగి నన్నుఁ గాపాడితిరి.

సుభద్ర:—మిమ్ము వధించునటు లెవ్వరు ప్రతిజ్ఞ నొసంగిరి ?

చిత్రసేనుఁడు:—ఆరాజ్యము నేలు శ్రీకృష్ణపరమాత్ముఁడు !

సుభద్ర:—[వివర్ణవదన యై] ఆ ! ఎవరు ?

చిత్రసేనుఁడు :—శ్రీకృష్ణపరమాత్ముఁడు —దేవీ ! ఆకృష్ణపరమాత్మునిబారినుండియే మీరు నన్నుఁ గాపాడవలెను. అటులు చేసి మీవాగ్దానమును జెల్లించుకొనవలెను.

సుభద్ర:—[పరితపించుచు] అయ్యో! కృష్ణమూర్తియా? నాభ్రాతయా?

శా. అన్నన్నా! పెనుమోస మయ్యెను గదా!
హా యెట్లోకో! కృష్ణు మా
యన్నన్ సత్యనుత ప్రతిజ్ఞు నెడసే
యన్ సాధ్యమే సాధ్యమే
బన్నం బందక మాట నిల్పుకొన, నా
భర్తృప్రతాపంబు నా
యాన్నత్యంబును జెల్లు టయ్యనఘుమా
హాత్మ్యంబునం గాదొకో!

సంధ్యావళి:—అమ్మా! మాయిరువురిమాంగల్యములు మీయధీన మునం దున్నవి.

సుభద్ర:—అయ్యో! కృష్ణునితో సాటిగ నెవరు నిలువఁగలరు? అతని బారినుండి యితని నే నెటులు గాపాడఁగలను? జగదీశ్వరా! న న్నిట్లు నవ్వుఁబాటులఁ జేయుట నీకుఁ బాడియా? తెలియక వీరికి అభయ మిచ్చితిని. ఇప్పుడు నే నెట్లు వెనుదీయుదును? అయినను ఆడినమాట నెట్లు నిర్వహింతును? ఆహా! ఈధర్మ సంకటమునకు నే నేమి సేయఁగలను? నారదమునీశ్వరుఁడు అప్పుడే చెప్పియుండెను.

[నారదుఁడు ప్రవేశించును]

నారదుఁడు:—అవును! నే నప్పుడే చెప్పితిని! అప్పుడే చెప్పితిని! విన వైతివి. అన్యుల విషయములలో జోక్యము గల్పించుకొనకు మని అప్పుడే చెప్పితిని—సుభద్రా! యేమి విశేషము?

సుభద్ర:—[నిష్ఠురముతో] ఏమి విశేషమా? మీకుఁ దెలియనిది యే మున్నది? అన్నియు మీవలననే జరిగెను.

నారదుఁడు:—సుభద్రా! ఇదేమి వైపరీత్యము! విషయ మేమో చెప్పుము.

సుభద్ర:—ఇదిగో వీరివిషయము సరిగా తెలిసికొనక చిత్రసేనుఁ డను నీగంధర్వుని గాపాడెద నని అభయప్రదానము చేసితిని. పిమ్మట నాయుదంతమును వా రెఱింగించిరి. గాలవఋషిప్రార్థనలకు ఈకొని యీచిత్రసేనుని మాయన్న శ్రీకృష్ణమూర్తి నేఁటి దినము సూర్యుఁ డస్తమించులోపలఁ జంపునటులు ప్రతిజ్ఞ చేసి యుండె నఁట. ఈధర్మసంకటమునకు నే నేమి చేయఁగలను? మించి వాగ్దానము గావించితి.

నారదుఁడు:—అయ్యో! ఎంతచిక్కు వచ్చినది! ఎంత ప్రమాదము కలిగినది!

సుభద్ర:—స్వామి! మీ రేమియు నెఱుంగనివారివలె నాతోపాటు దుఃఖ మభినయింపకుఁడు. దీనినిగుఱించి నిజముగా మీ కేమి యుఁ దెలియదా?

నారదుఁడు:—కొంచెము తెలిసియుండవచ్చును. అందుకొఱకే యీవైపునఁ బోవల దని అప్పుడే చెప్పితిని. వినవైతివి. కార్యము మించిపోయినది. ఇఁక నేమి చేయవచ్చును?

సుభద్ర:—ఇఁక నేమి చేయవచ్చునా? స్వామి! తామే దీనికి సాధనము చెప్పవలయును. మీవలన నేకదా యిది యంతయు సంభవించినది?

నారదుఁడు:—నావలన సంభవించినదా? తప్పు ఒకరి దైన, పాపఫలమనుభవించువారు మఱియొకరా? అమ్మా! నన్ను నిందింపకుము. వ్రతఫలము పొందఁ గోరితి వేని, నీప్రతిన చెల్లించుకొనుము. లేనియెడల చేసినవాగ్దానమును మరలించుకొనుము. ఇందులకు పరితపింప నేల?

సుభద్ర:—స్వామి! స్వామి! ఏ మట్లనెదరు? వ్రతఫలమును పోఁగొ

ట్టుకొందునా ? నామాటను నే నెట్లయినఁ గాపాడుకొనవల యును. అందులకు దారి మీరే చూడవలయును.

నారదుఁడు:—[యోజనతో] ఆలాగుననా !—ఇది— కష్ట మైన— కార్యము. ఆనీలమేఘశ్యాముఁడు యుద్ధమునకు బయలుదేఱిన, అతనికి ముందు నిలుచువా రెవరు ? మీఁదుమిక్కిలి అతఁడు నీ సోదరుఁడు.

సుభద్ర:—ఐన నేమి ?

నారదుఁడు:—ఏమియు లేదు !—ఒకదారి కనఁబడుచున్నది గాని, అది కష్టసాధ్యము.

సుభద్ర:—స్వామి ! ఆదారి యేది ? ఆకష్ట మెద్ది ?

నారదుఁడు:—శ్రీకృష్ణునకు సమానుఁ డైనశూరుఁడు గాండీవి యొకఁడే.—ఆయినను శ్రీకృష్ణునకుఁ నీవు సోదరివి. గాండీవికి శ్రీకృష్ణుఁడు బావమఱఁది. ఇరువురును ప్రాణస్నేహితులు. ఇందుల కేమి చేయను—ఊఁ—నా కెందులకు ఈకష్టము? అద్దాని చెప్పనేల? వృథగా నారదుఁడు కలహప్రియుఁ డని అప వాదము చెంద నేల ?

సుభద్ర:—స్వామి ! స్వామి ! అట్లు ఎంచఁదగదు. నే నెన్నఁటికైన నట్లు భావింతునా ? ఆమార్గమును నాతోడఁ జెప్పుఁడు.

నారదుఁడు:—అర్జునుని వశపఱచుకొనిననే, మనకార్యము సమకూ రును. అతనివలనఁ దప్ప మఱేరివలనను గూడ నీకార్యము కా నేరదు. అంతే.

సుభద్ర:—అయ్యో ! అందులకు నే నేమి చేయఁగలుగుదును ! నా థుఁడు ఈవార్త విన్నమాత్రముననే, నామీఁదఁ గోపగిం చునే !

నారదుఁడు:—అందుల కేమి? నీసామర్థ్యముచే నీభర్తను వశపఱచుకొని చిత్రసేనుని ప్రాణమును గాపాడవలయును. పశుపతిని గెలిచినపార్థునకు విరోధిగాఁ బరంధాముఁడు నిలువఁడు. ఐనను, అమ్మా! సుభద్రా! యిందున నీయిష్టానుసారము చేయుము. నేను చెప్పితి నని యేమియు చేయవలదు. కడపట పెనిమిటికిని అన్నకును నారదుఁడు కలహాము పెట్టెనని నన్ను నిందింపకుము.

సుభద్ర:—స్వామి! మీరు చెప్పినదే మంచియోజన. మీరు నా ప్రయత్నమునకు తోడ్పడవలెను. ఎట్లైనను నావాగ్దానమును నేను గాపాడుకొనవలయును. ఇఁక వ్యర్థముగాఁ గాలహారణము చేయఁగూడదు. చిత్రసేనా! నేను వార్త నంపువఱకును మీ రందఱును ఇచ్చటనే చాటున నుండుఁడు.

చిత్రసేనుఁడు, సంధ్యావళి:—అట్లే అమ్మా!

సుభద్ర:—స్వామి! తాము న న్నిందు రావించినకార్యము ముగిసినదిగదా! నా కింక నుత్తరువు నిండు.

నారదుఁడు:—

గీ. భద్ర మగుఁ బోయి రమ్ము సు-భద్ర! నీకుఁ
గలుగుత సుమంగలీత్వ మె-క్కాలమునను
సేమ మొనగూడె నోచిత్ర-సేన నీకుఁ
గలుగఁగా నేర దింక నె-వ్వలన భయము.

[సుభద్ర వెడలును.]

చిత్రసేనుఁడు, సంధ్యావళి:—స్వామి! అంతయుఁ దమకటాక్షము.

[తెర వ్రాలును. అందఱు నిష్క్రమింతురు.]

రంగము ముగిసినది.



# గాలవఋషి నాటకము
లేక
# చిత్రసేనోపాఖ్యానము

---o---

## నాలవ అంకము — మొదటి రంగము

[కృష్ణునివిడిది—ప్రాతఃకాలము. కృష్ణుఁడు చింతాక్రాంతుఁడై పీఠముపైఁ గూర్చుండియుండును. సుభద్ర వచ్చును.]

కృష్ణుఁడు—రమ్మా, సుభద్రా! కూర్చుండుము. ఏమివిశేషము? కడుదూరము వచ్చితివి. నన్నుఁ జూడఁగోరి యుండిన, నేనే యచ్చటికి వచ్చియుందునుగదా?

సుభద్ర—విశేష మేమియు లే దన్నా! మిమ్ముఁ జూచి చాలకాల మైనందునఁ జూచి పోవ వచ్చితిని.

కృష్ణుఁడు—మిక్కిలి సంతోషము. నీభర్త క్షేమముగా నున్నాఁడా? ధర్మరాజు మున్నగువారు కుశలమే కదా?

సుభద్ర—ఏకొఱంతయు లేదు, అందఱును క్షేమమే.

కృష్ణుఁడు—బాలుఁడు అభిమన్యుఁ డేఁడి?

సుభద్ర—వానిని దీసికొనిరాలేదు. నే నొక్కతినే వచ్చితిని.

కృష్ణుఁడు:—నీవు వచ్చినకార్య మశ్లేదైన నున్నఁ జెప్పుము.

సుభద్ర:—వేఱేమియు లే దన్నయ్యా! ప్రాణనాథుఁడు మఱుదినమే మరలివత్తునని చెప్పి, వేఁటకుఁ బోయి నేఁటికి నాలుగుదినములు గావచ్చినను రాలేదు. నా కూఱట కలుగ దాయె. ఒకవేళ, నిచ్చటికి వచ్చియుందు రేమో కనుఁగొని పోద మని వచ్చితిని.

కృష్ణుఁడు:—ఇంతే కదా! ఏమో యని తలఁచితిని! ఇట్టివా[illegible]కిని వగఁ జెందవచ్చునా? వేఁటాడుటకుఁ బోవుటయు, మునకుఁ బోవుటయు రాజులకు సహజవృత్తి. ఉద్దేశించిన కార్యములు పూర్తిచేసికొనికదా మరల రావలయును? [యోజనతో] రాచఱికమందలికష్టములు ఇప్పుడు గదా అనుభవమునకు వచ్చుచున్నవి. ఎంతకష్టము! [అని నిట్టూర్పుపుచ్చును]

సుభద్ర:—అన్నయ్యా! ఏమి యిట్లు నిట్టూర్పు విడిచెదరు? మీకును మనఃక్లేశములా!

కృష్ణుఁడు:—అమ్మాయీ! అ దేల య ట్లడిగెదవు? లోకమునందలి మనఃక్లేశము లన్నియు నావే గదా!

సీ. రాచఱికము దుర్భరము దుష్కరము తల్లి
సౌఖ్యమ్ము సున్న రాచఱిక మన్న
ప్రజలదుఃఖము లెల్లఁ బైపయిఁ బడుచుండుఁ
బరరాజభయ మొక్క ప్రక్క నుండు
పాపపుణ్యము వేఱుపఱుచుట సత్యానృ
తములు గుర్తించు టెంతయు శ్రమమ్ము
ప్రాలుమాలిన నిహపరలోకములు చెడు
సంగరమ్ములు డెందమునం గలంచు

గీ. ప్రజలు తత్త్వ మెఱుంగక ప్రభువు రాజ్య
మేలువాఁడు సుఖాంభోధి నోలలాడు
వాఁ డనుచు మెచ్చుచుందురు వాఁడు పడెడు
బాధ యెఱుఁగ రయ్యది పరాత్పరున కెఱుక.

ఒకదేశమున కధిపతిగా నుండి, అద్దానిని పాలించుటకన్నను, అరణ్యమునందు పాటలు పాడుచు పశువులఁ గాచుచుండవచ్చును.

చక్రవర్తికిని గర్మసూత్రము తప్పదు. జగదీశ్వరుఁడు విధించినరీతి కాఁగలదు. కానున్నది కాకమానదు. అద్దానిని వారింప మనకు నలవి కాదు. ఒకదృష్టాంతము చూడుము. చిత్రసేనుఁ డనునొకగంధర్వుఁడు యమునానదిమీఁదుగా నంతరిక్షమార్గంబునఁ బోవుచుఁ బుక్కిటివిడెము పుడమిపై నుమియంగ, నది దిగువ నర్ఘ్యము విడుచుచున్న గాలవమహర్షి దోసిటఁ బడెను. నే నీదేశమునకు, నధిపుఁడను గాన్సన, నతఁడు నాయొద్ద కేతెంచి మొఱనిడ, నేను రాజధర్మము ననుసరించి ఆచిత్రసేనుని వధించునటులు తటస్థపడెను.

సుభద్ర:—అయ్యో! వాఁడు తెలియక చేసినతప్పునకు వానిని వధించుట పాడియా?

కృష్ణుఁడు:—తెలియక యొనర్చినదియే తప్పు. పరమపావన మైనయమునానది! ఉషఃకాలమున తాపసోత్తములు భూసురులు మున్నగువారు స్నానాదులకు వచ్చుసమయము! ఇవి అన్నియు నరయక, దిగువ చూడక, తాంబూలోచ్ఛిష్టము నుమియఁదగునా? సామాన్యమానవుఁ డొనర్చిననే, మహాపాతక మగు, జ్ఞానవంతుఁ డగు గంధర్వపతి యిట్లొనర్పఁదగునా? పాపము, వాఁ డేమి చేయఁగలఁడు? వానివిధి అట్లు చేయఁ బ్రేరేపించినది. అద్దానిని వారింప నేరికిఁ దరము?

సుభద్ర:—అన్నా! మీరు చేయ నెంచినచో, ఏది మీకుఁ గష్టసాధ్యము? మిమ్ము వేఁడికొందును.

మత్త. అన్న! మీరు క్షమింపఁగాఁ దగు నాగ్రహం బుడుగం దగున్
తె న్నెఱుంగక చేసె నాతఁ డదేమొ యల్పపుదోషమున్
విన్నవించుచు విభ్రమించుచు విహ్వలించుచు నుండునా
పన్ను నాతనిఁగూర్చి వేఁడెద పాహి పాహి కృపానిధీ!

కృష్ణుఁడు:—సుభద్రా! నీకుఁ దెలియనిరాజధర్మములు కలవా? నేనే ధర్మమార్గమును వీడిన, లోకపాలనము జరగు టెట్లు? గాలవ మహర్షికి వాగ్దానము చేసియున్నాను. ఆడినమాట నెఱవేర్పక తప్పవచ్చునా?

సుభద్ర:—అన్నా! ముందువెనుక లరయక, చిత్రసేనునికి అభయ మొసంగితిని. దానిని నెఱవేర్పవలెను. నేఁ జేసినప్రతిన తప్పకుం డునటులు మీ రనుగ్రహింపవలయును. ఇదే దోసిలి యొగ్గి వేఁడుదానను. మఱియు, కృష్ణునిచెల్లెలు బాసచేసి మాటతప్పె నని లోక మంతయు ఆడికొనదా?

క. వెన్నునిచెల్లెలఁటే! తా
నన్నది నిల్పుకొనఁజాల కటకటపడు నన్
చిన్నతనపుఁ బలుకులకున్
నన్నుం బాల్పఱపవల దనా! ప్రార్థింతున్.
అన్నయ్యా! ఇందులకు మీరే దారిచూపవలెను.

కృష్ణుఁడు:—సుభద్రా! నాప్రతిన నేను నెఱవేర్చుకొనవలదా?

సుభద్ర:—అన్నా! నాబాసయుఁ గాపాడుము. అందులకు మీరే విధానము చెప్పవలెను.

కృష్ణుఁడు:—సుభద్రా! నే నేమి చెప్పఁగలను? నే నెంతటివాఁడను? ఇందున నన్నడిగిన నేమిఫలము?

శా. గండాగొండితనంబునన్ శివుని వీఁకం దాఁకి యుద్ధక్రియా
శౌండీర్యంబును జూపి పాశుపతమున్ సాధించుకొన్నాఁడటే!
గాండీవమ్ము గలాఁడటే! విభుఁడు కల్గన్ నీకు నోసోదరీ
వెండిన్ వేఱొకతోడు వేఁడెదవె? తద్విఖ్యాతి సామాన్యమే!
అమ్మా! అంతయు జగద్రక్షకుఁడు విధించినరీతిని జరగఁగలదు. వేళ మీఱుచున్నది. ఇంటికి మరలుము.

సుభద్ర:—అన్నా! నేఁ జేసిన ప్రతినకు భంగము చేయఁగూడదు.

కృష్ణుఁడు:—అట్లే. నేను భంగము గావింపను. నెమ్మదిగాఁ బోయి రమ్ము.

సుభద్ర:—అన్నా! అంతియే చాలును. నేను బోయివచ్చెదను.

కృష్ణుఁడు:—పోయిరమ్ము. అమ్మాయీ—అర్జునుఁడు వచ్చినతోడనే, నే నడిగితి నని చెప్పుము.

సుభద్ర:—అట్లే [అని నమస్కరించును.]

కృష్ణుఁడు:—దీర్ఘసుమంగలీ భవ [అని ఆశీర్వదించును. సుభద్ర వెడలును. తెర వ్రాలును.]

రంగము ముగిసినది.

# గాలవఋషి నాటకము

లేక

# చిత్రసేనోపాఖ్యానము

## నాలవ అంకము - రెండవ రంగము

[సుభద్ర శయనగృహము—మధ్యాహ్నము. సుభద్ర విచారగ్రస్తయై యుండును.]

సుభద్ర:—ఆహా! నేఁడు శుభముహూర్తమున మేల్కాంటిని. ప్రాణనాథుఁడు మరలివచ్చుచున్నాఁ డనువార్త వినవచ్చినది. ఇంకను మందిరమున కేల రాలేదో? మధ్యాహ్నముకూడ మీఱుచున్నది. ఇఁకఁ గొలఁదిప్రొద్దే యున్నది. ఇంతలోపల ప్రాణనాథుని ఒప్పించి చిత్రసేనున కభయ మిప్పించి నే నాడిన మాటను నిలుపుకొనవలయును. ఈశ్వరా! జగదీశ్వరా! అంతయు నీయనుగ్రహము. ఆపద్బాంధవా!—అన్యుల నాపదల నుండి తొలఁగింప నెంచిన నన్నే ఆపదలకు గుఱి చేయుదువా? [కొంచె మాలోచన నభినయించి] నాప్రాణనాథుఁ డిపుడే వచ్చినను నే నెట్లు సమ్మతింపఁజేయఁగలను? నారదమునీంద్రుఁడు నుడివినరీతి నేదే నొకవంకఁ బెట్టి నాథుని మెప్పింపవలయును. ఒకప్రాణిని గాపాడుటకు తొమ్మిదితప్పులు చేసినను దోసము లేదని పెద్దలు నుడువుదురు. ఇం దేమైనను ఎగ్గుండిన నాసోదరుఁడు చెప్పకుండునా? [మరల ఆలోచన నభినయించి] అయ్యో! మఱియొకకష్టము గోచరించుచున్నదే! దాని నింత వఱకు తలఁపనైతినే! ప్రాణనాథుఁడు సమ్మతించినను దాని

మూలమున అతనికిని నాయన్నకును కయ్యము కలిగిన నెట్లు? కృష్ణార్జునులు గాఢమైత్రిఁ జెలఁగుచుండ వారిరువురి నెయ్యమునకు భంగము గావించుటయా? ఛీ! ఛీ! అటులు గానేరదు! ఏది యెట్లైనను వీ రిరువురును ప్రాణమిత్రులు. కాన, నెట్టిభయమును లేదు. [లోపల ధ్వని వినఁబడును] ఆ! అదిగో నాథుఁడు వచ్చుచున్నాఁడు. నిజముగా దేహారోగ్యము లేనటులే నటింపవలెను. అవును. అదియే మంచియుపాయము. [అని విగతభూషణ యై, మాసినచీర గట్టి ప్రక్కపైఁ బరుండి పొరలాడుచుండును.]

అర్జునుఁడు:—[ఆతురముతో వచ్చి] ప్రేయసీ! సుభద్రా! నీ విచ్చట నుండునది దెలియక ఎన్నిచోట్లనో వెదకుచుంటిని. నీదేహమున కేమి యసౌఖ్యము? ఏమి అస్వస్థత? ఏల పలుకవు?

ఉ. వాడినమోముతోడ నిటు వందురె దేటికి వీడ కిట్లు పూఁ
బోఁడిరో! నిన్నుఁ గన్గొనఁగఁ బొక్కెడు నామది; నీయనుజ్ఞ వెం
టాడెడు వల్లభుండ నని యూరయవో నను? దుఃఖకారణం
బోడక తెల్పుమా! చనవు లొల్కెడుపల్కుల నాదరింపుమా!

సుభద్ర:—[నిట్టూర్పుతో] ప్రాణనాథా! ఇప్పట్టున నైన రాఁగలిగితిరి గదా? నే నింక భాగ్యశాలిని!

అర్జునుఁడు:—[చెంత చేరి, కేలువట్టి లేపి ముంగురులను దువ్వి] ప్రాణనాయకీ! ఏమి అట్లనెదవు? నీకొదవ ఏమి? నీ కెవ రేమి ఎగ్గు చేసిరి? చెప్పుము శీఘ్రముగ

సుభద్ర:—[హీనస్వరముతో] ప్రాణనాథా! ఏమియుఁ జెప్పుటకుఁ దోఁచకున్నది. నాకష్టముల కన్నిటికిని మీరే కారణము.

అర్జునుఁడు:—ప్రియా! ఎంతటిమాట! నిన్నుఁ జేపట్టుటకు నేను బడిన

కష్టములు నీకుఁ దెలియవా? అట్లుండ, నిన్నెట్లు కష్టపెట్టఁగలను? పరిహాసింపకుము.

సుభద్ర:—అటులైన వేఁటకుఁ బోయి మఱుదినమే వత్తునని చెప్పి, ఇన్నిరోజు లేల తామసించితిరి?

అర్జునుఁడు:—[నవ్వుచు] ఇంతే కదా! ఇది యొకతప్పా! ఇందునకు పరిహారము వేఁడుము. ఏదైనను నిచ్చెదను.

సుభద్ర:—వేఁడవలయునా? లేనిమొడ నియ్యరా?

అర్జునుఁడు:—లేదు లేదు, నాబహిఃప్రాణమా! నీవు నా యర్ధాంగి వైనను నాప్రాణ మంతయు నీయధీనమై యుండ, నీవు వేఁడకయే నే నిచ్చెదను. నాయపచారము స్వల్పమైనను, దానికి నే నొనర్చు ప్రతిఫలము సంపూర్ణముగా నుండును. [అని ముద్దిడును.]

సుభద్ర:—ప్రాణప్రియా! అయిన నేఁ జేసినప్రాణదానము, మీరు నెఱవేర్పఁదగినదే కదా?

అర్జునుఁడు:—నిస్సందేహముగా! వీరపత్ని యన్న నిట్లుండవలయును. ఎవ రాభాగ్యశాలి? సత్వరముగఁ జెప్పుము.

సుభద్ర:—ఆవల వెనుదీయ్యరుగదా?

అర్జునుఁడు:—ప్రేయసీ! ఏల యిట్లు సందేహించెదవు? నాప్రాణ మంతయు నీయధీన మని, నే నిదివఱకే చెప్పలేదా? జగదేకవీరుఁడైన విజయునంతవాఁడే తుదకు ఒకయబల చేసినయభయప్రదాన ప్రతిజ్ఞను గాపాడ వెనుదీయునా? ఇది క్షత్రియధర్మమునకు విరుద్ధము గాదా? నీ వెఱుఁగవా? భయ మొందక చెప్పుము. ఎవ రైనను సరే! ఇదే బాసఁ జేసెదను.

ఉ. శంకరుఁ డడ్డు వచ్చినను సర్వసుపర్వులు మాఱు వల్కినన్
గొంకక నన్ను వెన్నుఁ డనుఁగుం జెలికాఁ డెదురాడి వేఁడినన్

సంకటపాటుతో నుసు అోసంగు మటంచును వేడువాని నే
నంకిలి లేక ప్రోతు నభయం బగు హస్త మిదే యొసంగితిన్.
[అని చేతిలో చేయి నిడును.]

సుభద్ర:—నాథా! మీరు మృగయావినోదమునకుఁ జని, యిడిన గడువులోపల రాకుండుటచే నేఁ గుందుచుండుతఱి నారదఋషి శ్రేష్ఠుఁ డిచ్చటికి వచ్చియుండెను. తత్సమయమున మునీంద్రుఁడు గౌరీవ్రత ప్రభావము చెప్ప, ప్రతిజన్మమందును మిమ్మే పతిగాఁ బొందుభాగ్యము కలుగుటకై ఆవ్రత మాచరింపఁ దొడంగితిని. ఉద్యానవనములో వ్రత మాచరించి దాని సమాప్తికై యెవ్వరికైనఁ బ్రాణదాన మొసంగుటకు నెమకుతఱిఁ దత్సమీపమున దీనాలాపము వినఁబడెను. అచ్చటికిఁ బోయి చూడ నొకపురుషుఁడు అగ్నికుండములో నుఱుకుటకు సంసిద్ధుఁడుగా నుండెను. వానిచెంత వానిభార్య లిరువురు వారి మాంగల్యరక్షణార్థమై ప్రలాపించుచు వారిపతిప్రాణము కాపాడ వేఁడిరి. తత్క్షణమే వానికిఁ బ్రాణదాన మొసంగితిని.

అర్జునుఁడు:—ఆలాగా! మిక్కిలి సంతోషము. ప్రాణనాయకీ! నీప్రేమాతిశయమును పతిభక్తియును కరుణార్ద్రరసమును మిక్కిలి కొనియాడఁదగినవి. ఇందులకు వగఁ జెందనేల? సతు లన నీవంటి వలెఁ గదా యుండవలెను? 'దేహి' యని యడిగిన, 'లే' దని చెప్పకుండుటయే దాతలకు లక్షణము. అందునుఁ బ్రాణదానము గొప్పదానము. అట్టిసందర్భము నాకు లభింపలేదనియే చింతిల్లుచున్నాను.

సుభద్ర:—[జంకుతో] ప్రాణనాథా! పిదప విచారింప, ఆపురుషుఁడు చిత్రసేనుఁ డనుగంధర్వుఁ డనియు, వానిని నేఁటిసాయంసమయములోపల సంహరించుటకు—మాయన్న శ్రీకృష్ణుఁడు-ప్రతిన చేసియున్నాఁ డనియును దెలిసినది.

అర్జునుడు:—[రిచ్చపోయి] ఎవరు? కృష్ణమూర్తియా!

సుభద్ర:—అవును. ప్రాణనాథా! నన్ను క్షమింపుడు. నాపైఁ గోప గింపకుఁడు. నన్నుఁ దిరస్కరింపకుఁడు. నేఁ జేసినపొరపాటు మన్నించి నాప్రతిన మీ రెటులైన నెఱవేర్పవలయు. [అని పాదములమీఁదఁ బడును.

అర్జునుడు:—[నిశ్చేష్టితుఁడై] సుభద్రా! లెమ్ము. ఎంతటికార్యముఁ జేసితివి? ఎంతటిప్రమాదము సంభవించెను? ఏమి, నాకుల స్వామితోడనా విరోధపడుట? ఈప్రతిన నే నెట్లు నెఱవేర్పఁ గలుగుదును?

క చెలికాఁడు, బావ, యాప్తుఁడు
కులదైవము, రక్షకుండు, గురుఁ, డని కొలుతున్
జలజాక్షునిఁ గృష్ణు నహో!
మలసి యతనితోడ ననికి మార్కొను టగునే?

సుభద్ర:—నాథా! నాథా! మీ రిట్లాడఁదగునా? ఆవనజాక్షుఁడు నాకు సోదరుఁడు కాఁడా? మీ రాతనిభక్తు లగుట నే నెఱుఁగనా? మానినికిఁ గష్ట మొదవినచో ప్రాణేశ్వరుఁడు గదా రక్షింపవలయును? దైవికము లగుకార్యంబుల నేవగఁ దప్పింప నగు? నామాటలు కల్లలైన నే నెటు లోర్తును? లోకప్రఖ్యాతి చెందినవిజయునిధర్మపత్ని సుభద్ర యాడినమాట తప్పె నని మిమ్ముఁ గదా తుదిని లోకు లందఱును బరిహాసింతురు!

[తత్సమయమున గానము వినవచ్చును. నారదుఁడు ప్రవేశించును. అర్జునుఁడు సుభద్రయు ముందునకేఁగి, తగుమర్యాదలు సలిపి నమస్కరింతురు. నారదుఁడు ఆసనము స్వీకరించును.]

అర్జునుడు:—స్వామి! మీరాక నాకుఁ గడునాహ్లాదము కలిగించెను. నామనఃక్లేశమును, భీతియుఁ దీఱెను.

నారదుఁడు:— ఏ మట్లు నెదవు ? నీ క్లేశమునకు భీతికిఁ గారణ మేమి ?

అర్జునుఁడు:— ముని శ్రేష్ఠా ! మీకుఁ దెలియనివి ముల్లోకంబుల నేవేని గలవే ? చిత్రసేనుఁ డనుగంధర్వుని నేటిసాయంసమయములోపల వధించునటులు శ్రీకృష్ణమూర్తి ప్రతిన చేసియున్నాఁడఁట! ఈసుభద్ర మీరు చెప్పినచొప్పున గౌరీవ్రత మాచరించి, మరలి వచ్చుతఱి, ఆచిత్రసేనునకు ప్రాణదాన మొసంగెను. ఆ ప్రతిన నెఱవేర్చుటకు నే నియ్యకొంటిని.

నారదుఁడు:— సరే ! అదియే కర్తవ్యము. ఇందు వైపరీత్య మేమి యున్నది?

అర్జునుఁడు:— ఏమి స్వామి! ఇట్లనతిచ్చెదరు ! నాకులస్వామితోడనా నేఁ గయ్యమునకుఁ గాఁ దిగుట? ఆవల మమ్మెవరు సరకు సేయుదురు?

నారదుఁడు:— అర్జునా ! భీరువువలె మాటలాడకుము. పశుపతి నొంచి పాశుపతాస్త్రము వడసినపార్థుఁడవు నీవ కావె ? నివాతకవచ కాలకేయాదులను దారుణసంగ్రామంబున భంగము నొందించి నది నీవ కావె? అట్టి శూరవరుఁడు నేఁడు సమరము తటస్థించి నపుడు వెనుదీయుదువా ? సుభద్ర శాస్త్రరీతిగ వ్రతము సలి పెను గాని, కృష్ణుఁడు ప్రతినపూనినది యామె కేమి తెలియును?

సుభద్ర:— ఔను స్వామి! నాప్రతిన భంగపఱచుట తగునా?

నారదుఁడు:— మఱొకవిషయముకూడఁ దోఁచుచున్నది. పాండవులు దుర్బలులు, శౌర్యహీనులు, కృష్ణునిసాయంబు లేకున్నఁ గాను సకుం గొఱ గారు అను అపఖ్యాతి మీకు పూర్ణముగఁ గలిగి యున్నది. అద్దానిని వారించుకొనుటకు ఇదియే మంచితరుణము. ఇప్పుడు వెనుదీసిన, మీసత్యనిత్యతకే భంగము కలుగును. కాన కర్తవ్యం బాలోచింపుము.

అర్జునుడు:—[ఆలోచించుట నభినయించి] స్వామి! ఏది యెట్లులైనను సత్యవ్రతభంగమునకు నోర్వఁజాలను. సత్యనిత్యతకే కదా, కాంతారవాసంబున మే మెన్నిపాట్లో పడుచుంటిమి?

సీ. అలహరిశ్చంద్రుఁ డత్యాపన్నుఁ డయ్యు స
త్యాసక్తి మాహాత్మ్య మందినాఁడు
నలమహారాజు కానలపాలుపడి కూడ
నిజముచేఁ జిరకీర్తి నెగడినాఁడు
రామచంద్రుఁడు సత్యరతి వెత లందియు
నవతారమూర్తియై యలరినాఁడు
అందాఁక నేల మాయన్న ధర్మాత్మజుం
డాడి తప్పక పుణ్య మందినాఁడు

తే. అనుజులము మేముఁ గూడ సత్యమునె నమ్మి
యిడుమ లడవుల నిందాఁకఁ గుడుచుచుంటి
మద్దిరా! యిట్టిసత్యమాహాత్మ్య మెఱిఁగి
యెఱిఁగి నే దాని నెట్లు పొల్లుపుచ్చఁగలను!

కాన అభయ మొసంగి ఆదరించినపిదప అర్జునుఁడు తన ప్రాణమునైనను సరకుసేయక శరణాగతులను గాపాడు నని నమ్ముఁడు.

నారదుఁడు:—అర్జునా! నాకుఁ దోఁచినహితము చెప్పితిని. పిదప నీయిష్టము. నేను పోయివచ్చెదను.

[అని ఆశీర్వదించి గానము చేయుచుఁ బోవును.]

సుభద్ర:—నాథా! నేనును అన్నగారి సన్నిధి కేఁగి అడిగితిని. "నీపతి యుండువఱకు నీకేటికొఱంత? నీమనోభీష్టమునకు విరోధముగా నేను మెలఁగను," అని నాయన్నగారు నుడివిరి. కాన ఎందునకును జింతింపకుఁడు. ఆపరమాత్మునిశరణమే గతి యని అతనిని మనసున ధ్యానించి బాణమును సంధింపుఁడు. మీరు

నిశ్చయముగ జయము పొందఁ గలుగుదురు. నాథా! ఇంకను మీకుఁ గోపమా? ఈ దీనురాలు తెలియక చేసినపొరపాటును క్షమింపఁ దగదా?

అర్జునుఁడు:—సుభద్రా! నిన్ను మన్నింపక యితర మేమి చేయఁగలను? నీయం దేమితప్పు? సర్వమునకు సాక్షిభూతుఁడగు జగద్రక్షకుని మనోల్లాస మి ట్లుండ, దానిని వారింప నెవ రేమి చేయఁగలరు? [యోజన నభినయించి] ఇత్తీరునఁ గృష్ణపరమాత్ముఁడే, ననుఁ బరీక్షించు చున్నటులు దోఁచు చున్నది. కొన్ని దినముల క్రిందట మే మిరువురము నుల్లాసముగా మాటలాడుకొను చున్నపుడు వేడుకకొఱకు నన్నుఁ గయ్యమునకుఁ బిలిచెను. వేడుక కైనను నే నతనితో దుర యొనర్ప నని దృఢముగాఁ బలికితిని. తన్నిమిత్త మీరీతి నన్నుఁ బరీక్షించెఁ గాఁబోలు. చిత్రసేనుని వధించునటు లాతఁడు ప్రతిన యొనర్చి నీమూల మున నేను చిత్రసేనునికి అభయదాన మొసఁగునటులు గావించెఁ గాఁబోలు! నాకులదైవ మగుకృష్ణు నెదుర్కొని గాండీవమును ఎక్కుపెట్టుటయా? ఈచిత్ర మెట్లు ముగియునో తెలియదు. సరే! నేను బోయివచ్చెదను. ఆనతిమ్ము. హా! కృష్ణా! ద్వారకావాసా!

శా. నిన్నుం గయ్యమునందు గెల్చితినయేనిన్ సర్వనిర్వాహకున్
వెన్నున్ మీ తెఱు బార్థుఁ డన్న యశ మూర్విన్ గాంతు నార్తావనో
త్పన్న శ్రీకిర వౌదు; నావిధము కాదా? చక్రధారాహతిన్
గ్రన్నన్ స్వర్గరమానుభోగి నగుదున్ గంజాక్షుచే మీఁదుగన్.

సుభద్ర:—నాథా! విజ యోస్తు, విజ యోస్తు. నే నుడివినమాట మఱవకుము. [అర్జునుఁడు వెడలినపిదప] ఇదే చిత్రసేనునకు

వార్త పంపెదను. ఆహా! సమరమన్న నాయెుడలు కంపమందు చున్నది. ఏమి ప్రమాదములు సంభవించునో కదా? నే నెటులైనను వీరివైరము మాన్పవలయును. నేను బోయి చూచెదను. [అని సత్వరముగ వెడలును. తెర వ్రాలును.]

రంగము ముగిసినది.



# గాలవఋషినాటకము
లేక
# చిత్రసేనోపాఖ్యానము

---:o:---

## ఐదవ అంకము – మొదటి రంగము

[నిర్జనప్రదేశము – సాయంసమయము. కృష్ణుఁడును గాలవఋషియు వచ్చుచుందురు.]

**గాలవ:**—ఓ! కృష్ణా! సూర్యాస్తమయసమయము గావచ్చినదే! ఇంకను నీ ప్రతిన నెఱవేర్పలేదే! అర్జునుఁడు ఆ చిత్రసేనునికి అభయ మొసంగి నీవు ప్రయోగించుబాణములన్నియును హత మొనరించుచున్నాఁడే! భద్రము. కాల మాసన్నమగుచున్నది. శీఘ్రము. శీఘ్రము.

**కృష్ణుఁడు:**—ఋషివర్యా! అర్జునుఁడు కాపాడిన నేమి? ఈమీ భృత్యుఁడు ఆడినమాట యించుకైనను దప్పునా? మీ రెందులకును భీతి చెందకుఁడు. ఈ నారాయణాస్త్రమును దప్పింప నరునిచే సాధ్య మగునా? ఇదిగో దీనిని ప్రయోగించి నా ప్రతిజ్ఞను నెఱవేర్చెదను చూఁడుఁడు. రండు.

[గాలవఋషి వెనుకనంట వడిగాఁ బోవును. మఱియొకప్రక్క చిత్రసేనుఁడు వెనుక రాఁగా, అర్జునుఁడు వచ్చుచుండును.]

**చిత్రసేనుఁడు:**—అర్జునరాజా! అర్జునరాజా! మీ రింతవఱకుఁ గాపాడినది గొప్ప కాదు. అదిగో అతితీవ్రముగ నారాయణాస్త్రము ననుఁ జంపవచ్చుచున్నదే! అఖిలలోకైకవీరుఁడ వగు అర్జునరాజా! అభయము! అభయము! అదె వచ్చుచున్నదే! వచ్చుచున్నదే!

**అర్జునుఁడు:**—చిత్రసేనా! భయపడకుము. భయపడకుము. శంకరుఁడొసంగినపాశుపతాస్త్ర ముండువఱకు ఫల్గును నోడింపఁ బరం

ధాముని కైన నలవి గాదు. ఇదిగో, ఈ పాశుపతాస్త్రమును ప్రయోగించి, అపరంధామునిబాణమును పటాపంచలు గావించె దను చూడుము. నావెనుక నుండుము. [చిత్రసేనునితోఁ బోవును. లోపలఁ బెద్దశబ్దము వినవచ్చును. సుభద్ర ప్రవేశించును.]

సుభద్ర:—అయ్యో! నేను ఇందు వచ్చి నివారించుటకు మునుపే, యిరువురును యుద్ధమునకుఁ బూనుకొనిరే! ఆహా! వీ రిరువురు ప్రయోగించు అస్త్రములు లోకములను అల్లకల్లోలము గావించుచున్నవే! ఇంక నలుగడియలలో లోకములు భస్మీభూతము లగునట్లున్నదే! అయ్యో! నే నేమి చేయుదును? ఆవల పెనిమిటి, ఈవల అన్న! సురలకైన వారింప నలవి కాని దారుణ సంగ్రామము సలుపుచుండ, వీరు నామాటలు విందురా? భ్రాతృపక్షంబుగా నాడిన, భర్త యలుగును. భర్తృపక్షంబుగా నుడివిన, భ్రాత కసలును. వీరినడుమ నాకుఁ జిక్కు వచ్చినది. ఏమి చేయుదును?

ఉ. అన్న యొకండు భర్త యొకఁ డాజికిఁ జొచ్చిరి, వార లిర్వురున్
వెన్నును జూపనట్టిరణవీరులు; లోఁగ రొకళ్లొకళ్లకిం
దెన్నఁగ నేమి కాఁగలదొ! యెవ్వరి నే మనుదాన నయ్యయో!
పన్నగశాయి! భక్తపరిపాల! శుభంబు ననుగ్రహింపవే!

[తత్సమయమున రత్నావళియు సంధ్యావళియుఁ దొట్రుపాటులోఁ బరుగిడుచు వత్తురు.]

సంధ్యావళి: రత్నావళి:—దేవీ! దేవీ! మంచిసమయమునకు వచ్చితిరి. వీ రిరువురికిని సఖ్యము గావింపుఁడు. లేకున్న, లోకమే అంతముఁ జెందును. శీఘ్రము! శీఘ్రము! రండు.

సుభద్ర:—ఇదే వచ్చెదను. [అందఱు వెడలుదురు.]

రంగము ముగిసినది.



# గాలవఋషి నాటకము

లేక

# చిత్రసేనోపాఖ్యానము

---

## ఐదవ అంకము - రెండవ రంగము.

---

[రణరంగము. గాలవఋషి వెనుకనంటి రాఁగా కృష్ణుఁడును, చిత్రసేనుఁడు వెనుకనంటి రాఁగా అర్జునుఁడును, ఒకరి కొకరు ఎదురుదిశలనుండి వత్తురు.]

కృష్ణుఁడు:—ఓరీ! అర్జునా! అపరాధికా అభయ మొసంగి కాపాడె దవు?

అర్జునుఁడు:—అయ్యా! నిరపరాధిని వధింపఁ బూనుట మాత్రము పాడియా?

కృష్ణుఁడు:—అయినఁ జిత్రసేనుని, నీవు వదలవా?

అర్జునుఁడు:—అభయ మిచ్చినవాని బగతున కెట్లు ఒప్పగింతును?

కృష్ణుఁడు:—అర్జునా! సూక్ష్మముగా చెప్పెదను.

క. చెల్మిఁ దలంపవొ! బాంధవ
మ ల్మఱచితొ! బాహుబలవిముగ్ధుఁడ వయితో?
కోల్మసఁగించెదవే నను!
మేల్మేల్ నీచేవ! మదిని మెచ్చితి బావా!

అర్జునుఁడు:—అయ్యా!

గీ. చెలిమి దలఁతును బాంధవముల మఱవను
బాహుబలహార్ధ్యమును లేదు బావయెదుర!
ఆర్తునకు శరణార్థికి నభయ మొసఁగి
నాఁడఁ గాన నీతోఁడఁ బో రాడవలసె!

కృష్ణుఁడు:—అటులా ! అంతటిసమర్థుఁడవా ! నాతోడ సు రాసుర, సిద్ధ సాధ్య గరుడ గంధర్వాదులును గయ్యమున కియ్యకొనరు. మదీయచక్రానలజ్వాలలు ఆపరమశివుని కైనను సైరింప నలవి కావు. నీ వింకను లేఁబ్రాయపువాఁడవు. ప్రాణములు గాచు కొనుము.

అర్జునుఁడు:—అచ్యుతా ! క్షత్రియకులోద్భవుండ నై ఖడ్గంబు చేఁ బూని సమరసన్నద్ధుండ నై యుండ, ఈసందియం బేల నీకు ? శంకరకరుణాకటాక్షదత్తపాశుపతాస్త్రంబు నాచేత నుండ, నీ చక్రజ్వాలలు న న్నేమి చేయఁగలవు ?

కృష్ణుఁడు:—అ ట్లయిన ని న్నుపేక్ష సేయఁగూడదు. నీసామర్థ్యమును జూచెద.

అర్జునుఁడు:—నావాంఛయు నదియే.

[ఇరువురు వారివారి వింటను ఎక్కుపెట్టుదురు. సుభద్ర వేగముగా వచ్చి వారిమ ధ్యను అడ్డముగ నిలుచును.]

కృష్ణుఁడు: —సుభద్రా ! తొలఁగుము.

అర్జునుఁడు:—దేవీ ! నీ విం దేల వచ్చితివి ? ఆవలఁ బొమ్ము.

సుభద్ర:—ప్రాణనాథా ! అన్నయ్యా ! ఇచ్చటనుండి నేను కదలను. నన్ను ముందుగ వధించి పిదప యుద్ధము సలుపుఁడు. మీ రిరువురును యుద్ధము చేయుటయు, అందువలన లోకము నాశము నొందుటయు, ఆపాపము నన్నుఁ బొందుటయునా ? మీ రిరువురును యుద్ధము మానకుండిన, ఈక్షణమే నేను ప్రాణత్యాగముఁ జేసికొందును. ఇది సత్యము.

కృష్ణుఁడు:—అమ్మాయీ ! న న్నేమి చేయు మనెదవు ?

అర్జునుఁడు:—దేవీ ! నే నేమి చేయవలయు ?

సుభద్ర:—మీయస్త్రములను మీటుకొని సమరము విరమింపవలయును. అన్నయ్యా ! మీరు గావించినశుభమునకు, మీరే

ప్రతికూలకార్యము గావింతురే? నాథా! నాసేవలలో నేదైన లోటుపాటు లుండినఁ దెలుపుఁడు. ఇప్పుడే దిద్దుకొందును.

[కృష్ణార్జునులు ఒకరి నొకరిని చూచుకొందురు.]

కృష్ణుఁడు:—[సుభద్రతో] నాకు అభ్యంతరము లేదు.

అర్జునుఁడు:—[సుభద్రతో] నాకును అభ్యంతరము లేదు. అయిన, మీ అన్నను, దాను బ్రయోగించినయస్త్రమును ముందుగ మరలించుకొను మనుము.

కృష్ణుఁడు:—నీభర్తను ముందు మరలించుకొను మనుము.

అర్జునుఁడు:—అతఁడే కదా ముందు ప్రయోగించెను. కాన అతఁడే ముందు మరలించుకొనవలయును.

సుభద్ర:—అన్నయ్యా! అటులే కావింపుము. ఇందులో నీపరువున కేమిలోటు?

కృష్ణుఁడు:—సరి, నీయిష్టము. ఇదిగో నాయస్త్రమును మరలించు కొంటిని.

అర్జునుఁడు:—ఇదిగో నేనును మరలించుకొంటిని.

కృష్ణుఁడు:—[ఆదరముతో అర్జునునిభుజముపై కేలిడి] అర్జునా! మన మేమి యుద్ధ మొనర్చితిమా?

అర్జునుఁడు:—లేదు. బావా! లేదు. ఎన్నఁడైనఁ గలదా?

కృష్ణుఁడు:—అర్జునా! లోకమునందు నీ వసమానమైన సామర్థ్యమును గలవాఁడ వని విని నీసామర్థ్యమును గన సాక్షాచ్ఛంకరుఁడే కైలాసమును డిగ్గి కిరాతునివలె వేషము పూని మల్లయుద్ధము చేసిపోయెను గాన నేనును నీబలాతిశయమును సమక్షమునఁ గనవలయు నను కుతూహలమున నిట్లు పన్నితిని. వేఱేమియుఁ గాదు సుమీ. అర్జునా! ముందు జరుగఁబోవు యుద్ధములలో మీకు సంపూర్ణజయ మగుఁ గాక!

అర్జునుడు:—బావా! సర్వమును నీవన్నుగడ యని నే నెఱుఁగనా? నే నెంతటివాఁడను?

గాలవ:—ఓకృష్ణా! ఇఁక నాగతి యేమి కావలెను? కపటనాటక సూత్రధారి వనుపేరు నీకే తగును. మీరిరువురును సఖ్యపడితిరి. పిదప నాకుఁ గావించినవాగ్దాన మేమి చేసెదవు? అప్పుడే నారదుఁడు చెప్పియుండెను—నీమాట నమ్మవల దని! అది సరిపోయెఁగా!

[నారదుఁడు ప్రవేశించును]

నారదుఁడు:—అప్పుడే చెప్పితిని! అప్పుడే చెప్పితిని! వినవైతిగదా?

కృష్ణుఁడు:—అట్లు గాదు. మీరు పొరపడితిరి. గాలవమునీంద్రా! నే నాడినమాట తప్పుదునా? దాని నిదిగో నెఱవేర్చెదఁ జూడుఁడు. [చిత్రసేనునివంకఁ దిరిగి] చిత్రసేనా! ఇట రమ్ము. నీశిరస్సు నీమహర్షి పాదములపై నిడి క్షమాపణ వేఁడుము. ఋషిశ్రేష్ఠా! 'చిత్రసేనునిశిరస్సు మీపాదములపై నిడువాఁడ' నని నేను జేసినశపథము నిదిగో నెఱవేర్చుకొనుచున్నాను.

చిత్రసేనుఁడు:—[గాలవఋషిపాదములపైఁ బడి] తపోనిధీ! తెలియక మీదాసుఁడు చేసినయపచారమును మన్నింపవలయును.

గాలవ:—చిత్రసేనా! లే లెమ్ము. మన్నించితిని. ఇఁక నైనను జాగ్రత్తగా నుండుము.

చిత్రసేనుఁడు:—అట్లే స్వామీ! మహాభాగ్యము.

కృష్ణుఁడు:—చూచితిరా! ఇప్పుడు అందఱ వాగ్దానములు నెఱవేఱినవి.

నారదుఁడు:—సందేహ మేమి?

గాలవ:—చాలసంతోషము.

శా. త్రైలోక్యమ్మును గాచుదేవ! హరి! మోహైత్యారి! పాపంబు ను
న్మూలింపన్ సుకృతంబు పాదుకొలుపన్ భూభాగమం దెత్తెతిన్
లీలామానుషవేషధారి వయి యోలిన్ నీవు వర్తించుటల్
మాలో మేము దలంచుకొందుము మహాహ్లాదాబ్ధి నోలాడుచున్.

దేవా! త్రిలోకములయందును నీకు సాటి యేవ్వైనను గలరే? నీ వెఱుంగనిది యొం డుండునే? జగద్రక్షకుడును, శిక్షకుడును నీవే. నీమహిమ నెఱుంగక అజ్ఞానమున నీఁదులాడుచుందురు గాని వేఱేమియు లేదు. ధన్యోస్మి! ధన్యోస్మి!

కృష్ణుఁడు:—స్వామి! మీదాసుఁడను. మీకు శ్రమ కలిగినందులకు మన్నింపవలెను. [సుభద్రవంక తిరిగి] అది యుండనిమ్ము. సుభద్రా! చూచితివా? అన్న యని యించుకైనను జింతింపవైతివి. పెనిమిటినే కదా హెచ్చుగ భావించితివి?

సుభద్ర:—అన్నయ్యా! మీరు నాకు బాల్యమున నుపదేశించిననీతియే కదా! కాననే ప్రాణనాథునే దైవముగ భావించి నడచుకొంటిని. లేకున్న నిందార్హురాలను గానా?

కృష్ణుఁడు:—అమ్మాయీ! నిజము. ఏదో మాటవరుస కంటిని గాని వేఱు గాదు.

నారదుఁడు:—ఇదియే పతివ్రతలపరమధర్మము.

చిత్రసేనుఁడు:—[భార్యలతో నాలోచించి] అమ్మా! సుభద్రాదేవీ! దాసుని ప్రాణములు కాపాడినందులకు ఏమి ప్రత్యుపకృతి గావింపఁబోదును? అయినను, ఇదిగో ఈయుంగుళీయకమును అంగీకరింప వేఁడెదను. [అని అంగుళీయకము నిచ్చును] ఇదియే దేవేంద్రసార్వభౌముఁడు నా కొసంగినది. దీనికి అమితమహిమాతిశయములు గలవు.

నారదుఁడు:—సుభద్రా! దానిని స్వీకరించి వ్రేలిని ధరింపుము.

కృష్ణుఁడు:—సోదరీ! అటు చేయుము.

అర్జునుఁడు:—దేవీ! మహర్షి యాజ్ఞ పాలనీయము.

సుభద్ర:—[స్వీకరించును.]

మంగళము.

సమాప్తము.

---

# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨ | ౨౧ | సంకదరిగి | వంకఁ దరిగి |
| 3 | ౨౦ | అణువదియాఱు | పదియాఱు |
| ,, | ౨౨ | చకితేంద్రియుఁడు | చలితేంద్రియుఁడు |
| ౪ | ౮ | కటాక్షింప | దాసునకు |
| ౯ | ౫ | అద్దాని ఊర్వశికి | అద్దాని నూర్వశికి |
| ,, | ౭ | మొలనాగ | మొలనాఁగ |
| ,, | ౧౮ | ఎంతఁ దప్పదలఁచితిని | ఎంతతప్పఁదలఁచితిని |
| ,, | ౨౦ | దేవకన్యకు | దేవవేశ్యకు |
| ,, | ౨౫ | చేయగలఁడో | చేయఁగలఁడో |
| ౧౦ | ౧౨ | కుండక | కుండఁగ |
| ౧౧ | ౨౧ | జూచుటకుకాదు | జూచుటకుఁ గాదు |
| ౨౧ | ౧ | గంభీరముతో | గంభీరముగా |
| ౫౦ | ౧౯ | నాకు తోఁచినద | నాకుఁ దోఁచినది |
| ౫౧ | ౧ | నీ వెవరు? | నీ వెవ్వారవు? |
| ,, | ,, | ఇచ్ఛట | ఇచ్చట |

# రామదాసు నాటకము

వెంకటరమణయ్య, బి. ఏ., గారిచే విరచితము.

భక్తిరసప్లావితము. ప్రదర్శనమునకు మిక్కిలి అనుకూలము.

వెల 10 అణాలు, పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

---

కతిపయాభిప్రాయములు.

గుంటూరు పత్రిక (13-3-23) :—........................
రామకథకు తరువాత ఆంధ్రులలో సర్వజనసామాన్య మయినది రామదాసు చరిత్రమే. రామదాసుకీర్తనల బఠించి ఆనందమున తేలియాడని ఆంధ్రు డరుదు. అట్టి రామదాసు కథను నాటకంగా రచించి ప్రదర్శనయోగ్యముగా చేసినందుకు ఆంధ్రులు గ్రంథకర్తకు కృతజ్ఞులయి యుండవలెను. యిదివరకు విద్యావంతులకు మాత్రమే అందికలో వున్న రామదాసు చరిత్రము నాటకముగా ప్రదర్శింపబడుటచే నిరక్షరులకును నుపయోగముకాక మానదు...... ........ ఆంధ్రులమత జీవితాభివృద్ధికి యీ గ్రంథము తప్పక తోడ్పడునని మానమ్మకం. ఇది స్వచ్ఛమైన ఆంధ్రదేశకథ యగుటచే ఆంధ్రులకు తప్పక నచ్చితీరవలయును.

---

పల్లె- వేంకటసుబ్బారావుగారు, గుంటూరు (25-2-23):—
కథాకల్పనయు, బహులాలిత్యము, నర్థగౌరవమును, ప్రశంసాపాత్రంబులు. పాత్రపోషణవిషయమై మీరు జాగరూకతగనే వర్తించితిరి.

---

మ. రామానుజాచార్యులు, బి.ఏ., రిటైర్డు, డెప్యుటీ కలెక్టరు, రాజమహేంద్రపురము (13-2-23):—

ఉత్సాహ. పామరజన హృద్యమై, మహాభావితులకు వేద్యమై
భామలకును బాలురకును- భక్తుల కనవద్యమై
రామదాసు నాటకము వి-రాజిలుచును శైలినిం
దామదం బొసంగు వేంక-టరమణకవి సత్తమా.

పుస్తకములు వలయువారీ క్రింది విలాసములకు వ్రాసిన బడయగలరు:

డి. వేంకటరమణయ్య, బి. ఏ.

నెంబరు 28, కారణేశ్వరగుడి వీధి, సైదాపేట, మదరాసు.

లేక

సి. బాలకృష్ణనాయుడు, వింటర్ బాదంకంపెని

నెంబరు 4, అంపర్సను వీధి, జార్జిటవును, మదరాసు.

పుస్తకములు, హిగింబాతం కంపెని, రయిల్వే పుస్తకశాలలలో కూడా దొరకును.

